Bibliographic Record Target

సత్యనారాయణ, సుంకర
మాభూమి : నాటిక / సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావు. - బెజవాడ : ప్రజాశక్తి కార్యాలయం, 1947.
(1), ii, (1), 129, vi p. :port. ;17 cm.
Record no. 108

Satyanārāyaṇa, Suṅkara
Mābhūmi : nāṭika / Suṅkara Satyanārāyaṇa, Vāsireḍḍi Bhāskararāvu. - Bejavāḍa : Prajāśakti Kāryālayaṃ, 1947.
(1), ii, (1), 129, vi p. :port. ;17 cm.
Record no. 108

# మా భూమి

నా టి క



రచయితలు :

సుంకర సత్యనారాయణ
వాసిరెడ్డి భాస్కరరావు



ప్రజాశక్తి ప్రచురణాలయం, బెజవాడ

ప్రచురణ నెం. 256

# రూపాయి పావలా

ప్రజాశక్తి ప్రెస్, బెజవాడ
జె. 18/సి—3000—18.12.47

## విజ్ఞప్తి

ఈనాటకాన్ని ప్రదర్శించువారు ముందుగా ఆంధ్రరాష్ట్ర ప్రజానాట్యమండలి ప్రధానకార్యదర్శి డాక్టరు రాజారావుగారికి (బెజవాడ) లిఖితపూర్వకంగా తెలియజేయాలి.

— రచయితలు




## రచయితలు:



వాసిరెడ్డి సుంకర

# మనవి

ఇది మా మూడో నాటకం. మా మొదటి నాటకం 'ముందడుగు'. ఈ నాటకానికి ఆంధ్ర ప్రజానీకం ఇచ్చిన బ్రహ్మాండమైన స్వాగతమే మమ్మల్ని 'అపనింద' రాయడానికి ప్రోత్సహించింది. ముందడుగు మూడువేల ప్రతులు మొదటి మూడుమాసాల్లోనే ఖర్చు అయిపోయాయి.

ఇంతలోనే మద్రాసు అడ్వైజరీ ప్రభుత్వం ఈ నాటక ప్రదర్శనాన్ని నిషేధించింది. ఇందుకు నిరసన తెల్పుతూ ఆంధ్ర ప్రజానాట్యమండలి ఆదేశానుసారం 15-8-46 వ తేదీన ఆంధ్రదేశమంతటా 'ముందడుగు దినోత్సవం' జరుపబడింది. తీర్మానాలు ప్యాసుజేశారు. టెలిగ్రాములు పంపించారు. రాయబారాలు నడిపారు. ఆంధ్రదేశంలో ప్రథమ శ్రేణికి జెందిన పత్రికలు, సాహితీసభలు, కవులు, నటకులు, ముందడుగును ఏకగ్రీవంగా అభినందించారు. కాంగ్రెసుమంత్రుల కోరికపై 'ముందడుగు' ఇంగ్లీషు అనువాదాన్ని కూడా పంపాం. అయినప్పటికీ ముందడుగు ప్రదర్శనంపై ఇంతవరకూ నిషేధం తొలగించకపోవడం శోచనీయం.

'మాభూమి'ని కూడా 'ముందడుగు'కంటె మరో ముందడుగు అని ఆంధ్ర ప్రజలందరూ అభినందించారు. అచ్చువేసిన రెండువేల ప్రతులూ మొదటి రెండుమాసాల్లోనే అయిపొయ్యాయి. ఆంధ్రదేశంలో ఇప్పటికి 125 'మాభూమి' నాటకదళాలేర్పడి వేయికిపైగా ప్రదర్శనలిచ్చాయి. ఇప్పటికి షుమారు 20 లక్షలమంది ప్రజలకీనాటకం చూపబడింది. కాంగ్రెసు మంత్రుల ఆధ్వర్యం క్రింద మద్రాసులో ఈ నాటకం ప్రదర్శింపబడి వారిచే మన్ననలబడసింది. కాని ప్రజా ప్రభుత్వ హయాంలోకూడా అధికారులు కొందరు ఇంకా నిరంకుశంగానే ప్రవర్తిస్తున్నారు. 'మాభూమి' ప్రదర్శనం పశ్చిమగోదావరి జిల్లాలో మొదట నిషేధింపబడింది. ప్రజాందోళన ఫలితంగా ఈ నిషేధం కొంత ఆలస్యంగానైనా రద్దు అయినందుకు సంతోషిస్తున్నాం.

గత సంవత్సరం నల్లగొండ జిల్లాలో జరిగిన ప్రజాపోరాటాన్ని గురించి ఈ నాటకం వ్రాయబడింది. ఆ పోరాటంలో 240 గ్రామాలపై పోలీసుదాడులుజరిగాయి. 8500 మంది అరెస్టుఅయ్యారు. 15390 మంది నైజాం ప్రభుత్వ హింసాకాండకు గురి అయ్యారు. 12 లక్షల 25 వేల విలువగల ఆస్తి లూటీ చేయబడింది. 52 గురు వీరులు ప్రాణాలను కోల్పోయారు. నైజాం కిరాతకుల చేతుల్లో 64 గురు స్త్రీలకు - మన తెలుగు సోదరీమణులకు - మానభంగం జరిగింది. వీరిలో యిద్దరు మరణించారు. ఈ మహోజ్జ్వల పోరాటమే మమ్మల్ని ఈనాటకం రాయడానికి ప్రోత్సహించింది.

నైజాం నిరంకుశత్వాన్ని ఎదిరించి వీరోచితంగా పోరాడిన, పోరాడుతున్న తెలంగాణా సోదరులకు 'మాభూమి' ఏ మాత్రం తోడ్పడినా మా ప్రయత్నం ఫలించిందని భావిస్తాం.

తెలంగాణా ప్రజల పోరాటంలో 7-8-47 నుంచి ఒక నూతన దశ ప్రారంభమయింది. హైదరాబాదు సంస్థానం భారతయూనియన్‌లో చేరాలనీ, బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడాలనీ స్టేటు కాంగ్రెసు పోరాటం ప్రారంభించింది. ఈ పోరాటంలో స్టేటు కాంగ్రెసు, కమ్యూనిస్టుపార్టీ ఆంధ్రమహాసభ మొదలయిన ప్రజాసంస్థలన్నీ పాల్గొంటున్నాయి. తెలంగాణా ప్రజాపోరాటంలో వచ్చిన ఈమార్పును దృష్టిలో పెట్టుకొని ఈ సారి 'మాభూమి' లో కొన్ని అవసరమయిన మార్పులు చేశాం. వీటిని కూడా ఆంధ్ర ప్రజానీకం ఆదరిస్తుందని విశ్వసిస్తున్నాం.

ఈ నాటక రచనకు మమ్మలను మొదటినుంచి ప్రోత్సహించి యెప్పటికప్పుడు తగు సలహాల నిచ్చి మాచే ఈనాటకం పూర్తి చేయించింది శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావుగారు. వారికి మాయందున్న వాత్సల్యానికి సర్వదా కృతజ్ఞులం.

— రచయితలు

# పాత్రలు

| నెంబరు | పాత్రలు | పరిచయం | వయస్సు |
|---|---|---|---|
| 1 | వీరారెడ్డి | కథానాయకుడు | 35 |
| 2 | ఖాసింసాహెబ్ | | 55 |
| 3 | సుభాన్ | రైతులు | 24 |
| 4 | రామిరెడ్డి | | 26 |
| 5 | శ్రీనివాసరావు | కాంగ్రెసువాది | 35 |
| 6 | జగన్నాథరెడ్డి | దేశముఖ్ | 45 |
| 7 | వెంకట్రావు | పట్వారీ (కరణం) | 50 |
| 8 | మస్తాన్ | ఖాజీ | 30 |
| 9 | రాముడు | దేశముఖ్ సేవకుడు | 35 |
| 10 | యల్లమంద | గొల్ల | 40 |
| 11 | సీతమ్మ | వీరారెడ్డి భార్య | 27 |
| 12 | కమల | వీరారెడ్డి చెల్లెలు | 14 |
| 13 | అమీన్ | సబ్ ఇన్‌స్పెక్టరు | 32 |

ఇద్దరు ముగ్గురు పోలీసులు

# I

## బందగీ సమాధి

[సబ్జామొక్కలు, సన్నజాజులు వగైరా రకరకాల పూలమొక్కలతో సమాధి అలంకరించి ఉంటుంది. వీరారెడ్డి, దాదేసాహెబ్ ఒక ప్రక్కన; సుభాన్, రామిరెడ్డి మరో ప్రక్కన నుంచుని ఉంటారు. వీరారెడ్డి భార్య సీతమ్మ, చెల్లెలు కమల సమాధిపై అగరవత్తులు వెలిగిస్తూ ఉంటారు. తెర లేస్తుంది. అందరూ కలిసి పాడుతూ ఉంటారు.

భాయీ, బందగీ,
నీ జీవితమే జీవితము
భాయీ బందగీ
వీరయోధుడా హారతు లివిగో
క్రూరనిరంకుశ దేశముఖుల ఈ
దారుణ హింసల రూపుమాపగా
పోరాటంబున ప్రాణాలొసగిన
నీవే అమర జీవివోయీ
మార్గదర్శివోయీ ॥భాయీ॥
విప్లవజ్యోతిని వెలిగించితివి
తెలగాణను నీవే
ఇంటింటను నీవే
మా హృదిలో నీవే॥

[కమల, సీతమ్మ, వీరారెడ్డి ప్రక్కకువచ్చి నుంచుంటారు. పాట అయిపోయిన తర్వాత అందరూ తమచేతుల్లో ఉన్న పుష్పాలు సమాధిపై చల్లుతారు.]

సుభాన్ : (నాలుగువైపులా తేరిపారజూచి) ఏం జనం తెంపు లేదు.

రామి : ఒహ్ ! జనమేంటి ? ఇసుకేస్తే రాలేటట్టుందా ?

దాదా : వచ్చే బండికి దిగేబండికి అంతులేదు ! ఏ చెట్టుకింద చూచినా బండే ; నిరుడే అనుకుంటే అంతకు రెట్టింపు జనం వచ్చింది ఈయేడు !

వీరా : అవును, ఏయేడు కాయేడు పెరిగిపోతూ ఉంది. ముందు ముందు ఇంకా వస్తారు.

దాదా : ఎనకటిరోజుల్లో రేపాల తిరణాలకి, సోమప్ప తిర ణాలకి ఇట్టాగే వచ్చేవాళ్ళు.

రామి : ఆఁ, ఏం వచ్చేవాళ్ళో. కొరివి తిరణాల మా గొప్ప తిరణాలని నిరుడు పనిమాల బండి గట్టుకెల్లా. తీరా చూడబోతే కుచ్చీ కాయలేరు.

దాదా : అక్కడ ఒకచోటే ఏంటి ? ఇప్పుడే తిరణాల కెల్లినా అంతే.

సుభాన్ : నిజమే దాదా.

రామి : అయితే మన బందగీ ఉర్సుకి జనం ఇట్టా పొర్లి వస్తం దేమిటి ?

దాదా : ఏమోబాబు. ఈ సిత్రమంతా అల్లాకే తెలవాలి.

వీరా : ఇందులో పెద్దచిత్ర మేముంది దాదా ? బందగీ పేరు రోజురోజుకి ప్రజల్లో పాకిపోతూ ఉంది. అందుకనే దూరదూరాన్నుంచి ఈ తిరణాల చూడ్డానికి జనం వస్తున్నారు.

సుభాన్ : బందగీ చచ్చిపోయి, ఇంకా పట్టుమని పదేళ్ళన్నా



గాల. అప్పుడే అతన్నిగురించి అనేకఊళ్ళల్లో వింత వింతగా చెప్పుకుంటున్నారు.

వీరా : అప్పుడే ఏమయింది ? ముందు ముందింకా చెప్పు కుంటారు.

రామి : ఏం! ఎందుకని ?

వీరా : అవును, అతను చేసినత్యాగమలాంటిది. ఆరోజుల్లో ఒక్కడే దేశముఖుతో ఎదిరించి పోట్లాడాడంటే మాటలా ?

సుభాన్ : అందులో విసునూరు దేశముఖు అంతవాడితో !

రామి : మూణ్ణాల్లు బతికినా అట్టా బతకాలి.

సుభాన్ : ఆయనకుతోడు అట్టాంటోళ్లు ఇంకా పదిమంది ఉంటే కనపడేది ఈ దేశముఖు తడాఖా.

దాదా : ఏదోమనం అట్టా అనుకోవడమేగాని, ఎంతమంది అయితే మాత్రం ఏంజేస్తారా మహారాజుని ?

రామి : ఏం, అంతలావు మొగోడా? ఎంతమం దిని చంపుతాడు!

సుభాన్ : ఎందుకు జంపడు, ఇట్టాంటి మన దాదాలంతా చేతులు ముడుచుక కూచుంటే ఏంచెయ్యకుండా ?

దాదా : చేశావూ, చేయలేదో, మూకాలం ఏదో గడచి పోయింది ఇక మీపడుచోళ్ళు దెసే తలకిందు లేమిటో చేయండి, అదీచూద్దాం.

సీత : అసలీ తగాదాకు మూలమేంటో !

సుభాన్ : ఏముంది, పదిమందిలో ఔననిపించుకోవడమే.

సీత : పదిమందిలో మంచి అనిపించుకుంటే ఆయన సొమ్మేం బోయింది ?

వీరా : ఎందుకుబోదు ? పదిమందీ బందగీ చుట్టే చేరితే, ఇక దేశముఖు మొఖం చూసేదెవడు ?

కమల : అతనుపైకివస్తే ఇంకా వీడిపెత్తనం ఎలాసాగుతుంది వదినా ?

దాదా : మన సుభాన్ యీడుకే ఆ ఊరోళ్ళందరితో షెబాస్ అనిపించుకున్నాడు.

కమల : అంత చిన్న వయస్సులోనే ఆ ఊళ్ళో ఏ తగాదా వచ్చినా ఈయనే తీర్పుజెప్పేవాడటగా దాదా ?

దాదా : ఊళ్ళో తగాదాలేమిటమ్మా, చివరకు మొగుడూ పెండ్లాం మధ్య కీసులాడుకున్నా అతనిదగ్గరకే వచ్చి చెప్పుకునేవాళ్ళు. అదేంపుటకో ! ఎవళ్ళకీ నొప్పి తగలకుండా తీర్మానంచేసి పంపించేవాడు. అట్టాంటోణ్ణి వాళ్ళ పొట్టన బెట్టుకున్నారు.

సీత : అంతబుద్ధిమంతుణ్ణి చంపడానికిఎవడికి చేతులాడినియ్యో !

సుభాన్ : (కోపంగా) తాగుబోతు. డబ్బుకు గడ్డిదిని ఖూనీ జేశాడు.

సీత : ఎవడు అంత పాపాని కొడిగట్టింది ?

కమల : ఎవడో గాదు, వాళ్ళ అన్నే వదినా !

సీత : చాల్లే పిచ్చిపిల్లా, తమ్ముణ్ణి ఎక్కడన్నా అన్న చంపుతాడూ ? ఏమిటా మాటలు ?

దాబా : నిజమేనమ్మా, అమ్మాయి జెప్పింది నిజమే. కసాయి ముండాకొడుకు వాళ్ళ అన్నే చంపించాడు.

రామి : అట్టాంటి దుర్మార్గుణ్ణి పగలకోసినా పాపం లేదు.

వీరా : వాడి పనిబట్టకం ఎంతసేపు, అసలీ తగాదా బెట్టిన దేశముఖుకి బుద్ధిజెప్పాలి గాని.



సీత : వాడి కడుపుగాల, అన్నచేతనే తమ్ముణ్ణి చంపించాడంటే వాడెంత మాయముండాకొడుకో ? అసలీ తగాదా బాగాలదగ్గిరొచ్చిందా ?

వీరా : భాగాలదగ్గిర తగాదా ఏముంది ? అయిదుగు రన్నదమ్ములూ తలా నాలుగెకరాలూ పంచుకున్నారు. ఇంటికి పెద్దోడని అబ్బాసలీకి జ్యేష్ఠభాగంకింద ఇంకో నాలుగెకరాలు ఎక్కువకూడా ఇచ్చారు.

దాదా : ఏం ఇస్తే ఏం ఫాయిదా ? వాళ్ళ పరువెక్కడ దక్కనిచ్చాడు ? తాగి తందనాలాడి తనకిచ్చిన ఎనిమిదెకరాల గడ్డా పాడుజేసుకున్నాడు.

వీరా : వాడు తాగితేం. తలకుబోసుకుంటేం?అదెవడికి గావాలి? మళ్ళీ వచ్చి నాకు భాగం పెడ్తారా, చస్తారా అని తయారయ్యాడుగా.

రామి : మళ్ళీ ఏ మొకంతో వచ్చాడు సిగ్గులేక, బాగం అంటే అంత అడ్డగోలుగా ఉందా ఏమిటి ?

సుభాన్ : ఎందుకుండదు ? వెనకమాల దేశముఖు బుజం వేసుకుంటే ఎన్ని ఆటలైనా ఆడొచ్చు.

దాదా : నాబోటోడైతే అప్పుడే గుడ్లు తేలేసేవాడు. కాని ఆడికదేం దైర్యమో ; పన్నెండేళ్ళు, డీ అంటే డీ అని దేశముఖుకు ఎదురు తిరిగి పోట్లాడాడు.

సీత : ఒక్కడే అన్నిరోజులు ఎట్టా పోట్లాడాడో !

వీరా : ఏముంది ? నోరుమంచిదయితే ఊరు మంచిదవుతుంది. చుట్టుపట్ల మన నాలుగూళ్ళ జనం (సమాధివైపు చూపి) ఈయనమీద ఈగ వాలనిచ్చారా ?

దాదా : సద్దెన్నం మూట బుజానేసుకొని కాళ్ళు కండెలు కట్టేట్టు పన్నెండేళ్ళు కచేరీ చుట్టూ తిరిగాడు.

సీత : పన్నెండేళ్ళే !

కమల : ఎన్నాళ్ళు తిరిగితే ఏం వదినా. చివరకి బందగీయే గెల్చాడుగా.

రామి : గెల్చాడూ? ఇవన్నీ పెద్దోళ్ళకి మాకేం తెలియవ్. నీ కెట్టా తెలిసినయ్ అమ్మాయ్.

సీత : (చిరునవ్వుతో) దానికెందుకు తెలియవ్. ఇంట్లో అన్న ఉన్నాడుగా నూరిపోయడానికి. (కమలతో) కానియ్. తర్వాత సంగతికూడా నీవే చెప్పు.

కమల : (ముసిముసి నవ్వులతో) నేను చెప్పడమెందుకు అన్నయ్యనే అడగరాదూ? నాకు చెప్పినట్టే నీక్కూడా చెప్తాడుగా.

సీత : (సిగ్గుతో) నేర్చావులే మాటలు నోరుమ్ముయ్!

(అందరూ నవ్వుతారు)

రామి : ఇంతకీ తర్వాత ఏమి జరిగింది దాదా!

దాదా : బందగీ గెల్చాడని కబురు తెలియగానే చుట్టు పక్కల నాలుగూళ్ళల్లో పండగ జేసుకున్నారనుకో.

సుభాన్ : ఏం పండగ జేసుకుంటే ఏం లాభం

సీత : ఏం?

వీరా : ఏముంది? బందగీ గెల్చాడంటే దేశముఖుకి నిద్రబట్ట లేదు. ఇక తన పచ్చిదోపిడీ సాగదనుకున్నాడు. కుట్రలు బన్నాడు. మిసల్ (రికార్డు) తెచ్చుకోడానికి పాపం ఒకరోజు బందగీ ప్రొద్దున్నే కచేరీకి బయల్దే



రాడు. సరిగ్గా ఇక్కడికే – మనం ఇప్పుడు నుంచున్న చోటికే – వచ్చాడు. కంచెలో దాక్కొనున్న దేశ ముఖు రౌడీలు అమాంతంగా ఒక్కసారి కత్తులతో బందగీమీద పడ్డారు. బందగీ తల తెగిపోయి నేలమీద పడింది. నెత్తురు కాలవగట్టింది.

సీత : రామరామ, కటికి చచ్చినోళ్ళెంతపని జేశారు!

దాదా : ఊళ్లో ఆరోజున ఒక్కరింట్లోకూడా పొయ్యి రాజ లేదు.

రామి : (ఆవేశంతో) ఎందుకు? మనదీ ఒక బతుకే, ముండ బతుకు.

సుభాన్ : కాకపోతే ఇంతపనీజేసి ఊళ్ళో ఇంకా ఆ దేశముఖు ఎన్ని గుండెలతో ఉంటాడు?

దాదా : ఏం జేస్తాం? గుడ్లనీళ్ళు గుడ్లల్లో గుక్కొని కుళ్ళి కుళ్ళి ఏడ్చాం. అంతా కలిసి తలా ఒక చెయ్యేసి ఎట్టాగైతేం చివరకి గోరీ కట్టించాం.

సుభాన్ : లోపల లోపల కుళ్ళి చచ్చేకంటే అంతా ఒక్క సారే కట్టగట్టుకొని చస్తే పోయేదిగా?

రామి : అంతా ఎందుకు చావాలి? ఈ గోరీపక్కనే ఆ దేశ ముఖు గోరీకూడా కడితే అందరి పీడా వదిలేది.

సీత : బందగీ అట్టాంటి పుణ్యాత్ముడు గనకనే ఈ పూజలు జరుగుతున్నై.

వీరా : వట్టివట్టి పూజలు చేసినంతమాత్రాన ఒరిగేదేముంది? బందగీ దేనికోసం బలైపోయాడో దాన్ని మనం సాధించినప్పుడే అతని ఆత్మకు శాంతి కలుగుతుంది.

రామి : ఇక చూద్దాం, వీడి ఆట లెన్నాలు సాగుతయ్యో.

సుభాన్ : ఎన్నాళ్లో ఎందుకు ? మనాళ్ళు నలుగురూ కలిస్తే రేపే పాటికి పూడ్చిపెట్టం ?

దాదా : ఎందుకొచ్చిన నోటిరంపురా బాబు, గోడలకు చెవులుంటాయి. ఈ గొడవంతా మళ్ళీ ఆదొరకు తెలిస్తే...

సుభాన్ : ఏం తెలిస్తే ?

రామి : చంపుతాడా ? చంపనీ; ఈ ముండ బతుక్కంటె ఆ చావే మేలు.

దాదా : తొందరపడితే పనులవుతయ్యా. దేనికైనా ఆ గడియ రావాలి.

కమల : ఏపని అయినా మన ప్రయత్నం లేకుండా ఎలా అవుతుంది దాదా ?

దాదా : నిజమే అనుకో అమ్మా. కాని ఏం జేస్తాం ? ఆయన బలవంతుడు. మనకు రెక్కాడితేగాని డొక్కాడదు. వాడు తల్చుకుంటే మన్ని చీమల్లాగ నలిపేస్తాడు.

వీరా : చీమలన్నీ కలిసి ఒక పెద్దపామును చంపివేయడల్లా ? మనం అంతాకలిస్తే వీడి బ్రతుకూ అంతే.

దాదా : అదినిజమే అనుకో నాయనా. ముందు మనాళ్ళంతా కలిసి రావాలిగా మరి ?

రామి : ఏంజేస్తారేం కలిసిరాక ? కడుపులో కాల్తుంటే అంతా కలుస్తారు.

వీరా : ఏం దాదా ? మన ఊళ్ళో ఇంతమంది జనమున్నామా. అంతా ఆరుగాలం చెమటోడ్చి కష్టపడి పనిచేసే వాళ్ళమేగదా ? ఇందులో ఒక్కడి కొంపైనా కాస్తి పచ్చగా ఉందేమో చెప్పు ?



రామి : అందాకా ఎందుకు ? బొక్కేడు కండున్నవాణ్ణి ఒక్కణ్ణి జూపెట్టు మనూళ్ళో ?

దాదా : అసలు తిండి ఉంటేనా కండ ఉంటానికి ?

సుభాన్ : పండినగింజంతా సర్కారే లాక్కుపోతా ఉండె; లెవీ అంట లెవీ !

వీరా : ఒక్క లెవీయేనా, పైన కార్పరేషన్ (ఖుష్‌ఖరీదీ) పేరుతో దోచుకునేదెంత ?

దాదా : అందాకా ? ఎందుకు. నా తిప్పలు చూడరాదు. దేశముఖుదగ్గిర మా పెద్దపిల్ల పెళ్లికెప్పుడో రెండుబస్తాలు నాగుకు తెచ్చినా. ఏటా తీర్చేది తీరుస్తానే ఉండా; పెరిగేది పెరుగుతానే ఉంది.

వీరా : మరి నీవే చెప్పు, ఇక మనం ఎలా బతకాలో ?

దాదా : ఇంకా ఒకటే బతకడం ! ఇట్టాగే ఎండెండి ఎప్పుడో ఒకరోజు రాలిపోవడమే !

రామి : ఇంకానయం. మన వీరారెడ్డి [illegible] వచ్చాడు గాబట్టి సరిపోయింది. లేకపోతే మన పటేల్ కూడా తిమ్మాపురం పటేలును మల్లే తఖ్తారాసిపెట్టినందుకు ఇంటికి 50 రూపాయలు గోళ్లూడగొట్టి వసూలు జేసేవాడే.

సుభాన్ : ఎట్టాజస్తాం. కదిల్తేలంచం, మెదిల్తేలంచం. బాడిగ తోలుకొని బ్రతుకుదామన్నా బండిపట్టాలుకూడా కరువేనాయె.

రామి : నీగోడు నాగోడు ఆలకించేదెవడు ? ఆ వచ్చిన నాలుగు జతలూ వాళ్ళే పంచుకున్నారు.

వీరా : ఒకబండిపట్టాలేమిటి? మనపని అంతా కొనబోతే కొరివి, అమ్మబోతే అడవిగా ఉంది. మనకు కావాలి సిందేది దొరుకుతూ ఉంది?

కమల : దేనిమాట ఎలా ఉన్నా, రాత్రిపూట కాసేపు చదువు కుందామంటే దీపంలోకి చమురుకూడా లేదాయె!

సీత : చదువూ చట్టుబండలు; చివరకు బిడ్డతలకు రాద్దామంటే రవ్వంత కొబ్బరినూనెకూడా కరువే అయిపోయింది.

దాదా : నిజమేనమ్మా నిజమే! ఏముంది–చెప్పుకుంటే మానం బోయే. చెప్పుకోకపోతే ప్రాణంబోయె నన్నట్టుంది మన బతుకు. ఇంట్లో ఒక చీరె ఉంటే మీ పిన్నీ, చెల్లెలూ చెరిసగం జింపి కట్టుకుంటన్నారు. పోనీలే అమ్మా! ఎందుకొచ్చిన గొడవ. చెప్పుకొంటంకూడా నామర్దా.

సీత : కాస్తి కుడీ ఎడమేకాని, అందరిపనీ అంతే ఉందిలే దాదా. (వీరారెడ్డి వైపు తిరిగి) వచ్చి చాలాసేపయింది. వెళ్తాం; అబ్బాయి గోల చేస్తా ఉంటాడు.

(సీతమ్మ, కమల బయల్దేరుతారు)

వీరా : రామిరెడ్డీ! అమ్మాయినీ వాళ్ళనీ అక్కడిదాకా పంపించి ఎడ్లకి నీళ్ళు బెట్టి కాస్తి మేతేసిరా.

(కమలా సీతమ్మలతో పాటు రామిరెడ్డికూడ వెళతాడు)

సుభాన్ : ఏం దాదా! మరి ఏమంటావ్? మనూళ్లోకూడా సంఘం బెట్టుకుందామా?

దాదా : మీ మాటలింటా ఉంటే సంఘం బెట్టుకోవడమే మంచిదనిపిస్తా ఉంది. కాని మనూళ్ళో తలకొకమాట–నిర్వాకమై చస్తుందా అని...



వీరా : మరేం పర్వాలేదు దాదా. మీబోటివాళ్ళు పైన కాసి ఊతమిస్తేచాలు. ఆ పని అంతా మేమే చేస్తాంగా.

దాదా : ఏమో బాబు! ఈ కాలపువాళ్ళ సంగతులు మాకేం తెలుస్తాయి? సుభానేమో సంగం బెట్టుకుందామంటాడు. వీడన్నేమో వద్దంటాడు.

సుభాన్ : ఎందుకు వద్దనడు? సంఘం బెట్టుకుంటే ఆయన పిచ్చికళలు సాగవుగామరి! మన పదిమందితోపాటు నిలిస్తే నిలుస్తాడు. లేక పోతే పోయి ఆ దేశముఖు చంకంకిందనే దూరనీ.

దాదా : మళ్ళీ మనలోనే కొందరిటూ, కొందరటూ? అయితే ఇక నిర్వాకమైనట్టే!

వీరా : డబ్బుకోసం గడ్డితినే రకం ఎవళ్ళో నలుగురు ప్రతి ఊళ్లోనూ ఉంటారు, అందుకని సంఘం బెట్టుకోకుండా మానుకుంటామా?

[యల్లమంద ప్రవేశం: మడిచికట్టిన ఎర్రంచు మొద్దుపంచ (గొల్లకట్టు) చేతిలో కర్ర, కర్రకు అన్నపు దుత్త. రొండున సగం కాల్చిన ఆకుచుట్ట, చెకుముకి సంచి, పాత చెప్పులు, లావాటి తలగుడ్డ, బుజాన గొంగళి, చేతులకు వెండి మురుగులు, రెండు చెవులకు పోగులు. కొనచెవికి జంపు, ఎడమచేతికి దండకడెం.]

యల్ల : (వస్తూనే) పొద్దున్నే లేసి వోడిమొగం చూసినోన్ని కట్టానికి కట్టం దప్పలా, నట్టానికి నట్టం దప్పలా (అంటూ చెప్పులూ, కర్ర, గొంగళి, ఒకప్రక్కనబెట్టి తలగుడ్డదీసి బందగీ సమాధికి దండంబెట్టి చెంపలు వేసుకుంటాడు.)

వీరా : ఏఁ యల్లమందా? ఇంతపొద్దెక్కిందాకా ఉన్నావేం?

సుభాన్ : ఏముంది ? ఏదో జరిగి ఉంటుంది.

దాదా : వాలకంచూస్తే అట్టాగే ఉంది.

యల్ల : ఏముంది సిన్నయ్యా ! మాబోటోళ్ళం మత్తానయ్య కింద బతికేట్టులేదు. తల్లిముండమొయ్య ఎంత అదర గండం ? భూమిమీద ఆగేట్టున్నడా !

వీరా : (ఆదుర్దాగా) ఏం, ఏమన్నాడేంటి ?

యల్ల : అంటవేంది ? సూడు, గూబకిబెట్టి సూకిండు.

సుభాన్ : (యల్లమంద చెంపమీద చేయివేసిచూస్తూ) ఏం పొయ్యేకాలమొచ్చింది ఇట్టాగొట్టాడు ?

యల్ల : ఆడెవడో ఇయ్యాల గడీకి జచ్చిండంట ?

వీరా : ఎవడు ?

యల్ల : ఆఁ అడుగాడే, ఇంకెవడుజచ్చిండు; ఆపోలీసుఅమీనే.

వీరా : అయితే ఇంకేం ? వేటపోతుకోసం యల్లమంద మంద మీద వచ్చిపడి ఉంటారు.

యల్ల : వచ్చినాళ్లు దేన్నో ఒకదాన్ని పట్టకపోతే ఒక ఏడ్పు ఏడ్చి ఊరుకుందును (సుభానువైపు తిరిగి) నలుగు రెడవనాయాళ్ళను యెమ్మటేసుకొచ్చి నీ అన్న మత్తానయ్య దేవరపోతును పట్టుకెళ్లిండుగందా ? ఎట్టా జావాలి ?

దాదా : అరేపాపం. ఆ దేవరపోతును వదలిపెట్టి ఇంకో దాన్ని అయినా చావమనకపోయావ్.

యల్ల : "నీ బానిచోణ్ణిబాబూ, కాల్ మొక్తా. దాన్నొదిలి పెట్టి ఇంకోదాన్ని తీసికెళ్ల" మంటేనే గూబ అదరే సిండు. (కండ్లవెంట నీళ్లు తిరుగుతాయి.)

దాదా : అరి బద్మాష్ !



వీరా : ఈ బద్మాషీ ఇలా సాగిపోవాలసిందేనా ! ఏం దాదా? ఎంతకాలమని చేతులు ముడుచుకూర్చుందాం ?

సుభాన్ : ఎంతకాలమేమిటి ? అప్పుడే యల్లమంద కర్ర తిరిగేసినట్టయితే ఆకాసిని జలుబు నీళ్ళ్యా వదిలేయి.

యల్ల : కడుపు మండిపోయింది. (చేతిలో కర్ర చూపెడుతూ) ఈ వంకకర్ర తిరగేసి దెబ్బకు పండబెట్టేవాణ్ణే బిడ్డణ్ణి; నిన్ను జూసి ఊరుకోవాలిసొచ్చింది సుబానయ్యా.

సుభాన్ : అన్నయితేం తమ్ముడైతేం ? ఇట్టాంటి ముండ మోపిపనులు చేసేటప్పుడు.

యల్ల : ఎంత సెడ్డా ఒక పేగున పుట్టినోళ్ళుగా.

వీరా : మనకలాంటి దేమీ లేదు యల్లమందా. అన్న యితేం తమ్ముడయితేం – మనకు ద్రోహంచేసేటవుడు మనం అంతా ఒకటే. కష్టానికి సుఖానికి మనతో పాటు ఉన్నవాడేమనవాడు. దేశముఖు చంకకింద ఎవడు దూరినా వాడు మనకు శత్రువే. కులమేదయితేం బీదోళ్ళంతా ఒకటే.

సుభాన్ : అంతే. మనమంతా ఒక తల్లిబిడ్డల్లాగా ఉండాలి. ఉంటే అంతా ఉంటాం. పోతే అంతాపోతాం.

(మస్తాన్ ప్రవేశం)

[కోరమీసం, సగంచేతుల చొక్కా, చొక్కాపైన జుబ్బా, కాళ్ళకు పాపోసులు, నెత్తిన కుచ్చుటోపీ చుడీదార్ పాయజామా, చేతిలో పంటరు, ముఖాన క్రూరత్వం ఉట్టిపడుతూ ఉంటుంది.]

మస్తాన్ : [దాదావైపు జూచి] సలాం అలీకం.

దాదా : అలీకం సలాం.

మస్తాన్ : ఓయ్, ఈ గొల్లాయనకూడా ఇక్కడి కెప్పుడో వచ్చాడే!

యల్ల : తిరణాల్లో ఏమన్నా తేరగా వత్తే నూక్కుపోదామని వచ్చా.

[మస్తాన్ యెల్లమందవైపు కోరచూపులతో చూస్తూంటాడు]

దాదా : మస్తాన్ ! ఎందుకు పాపం యల్లమందను గొట్టావంట? అతను లబ్బున ఏడుస్తన్నాడు.

మస్తాన్ : వాడి వేషాలు నీకేం తెలుసు? కాలు కదిపితే వీడి మంద దొరగారి పొలాల్లో తిరగాలీ? దొరగారి కవసరమై ఒక మేకపిల్లను తీసికెళ్తే ఏం? వీడి అమ్మామొగుడు సొమ్మంతా పోయిందా.

దాదా : తీసికెళ్తే తీసుకెళ్ళావ్ లే. ఆ దేవరపోతునే తీసుకెళ్ళడమెందుకు?

మస్తాన్ : దేన్ని బట్టుకున్నా దేవరపోతే అంటాడు; వాడికేం ఎన్ని అబద్ధాలైనా ఆడతాడు.

యల్ల : తల్లి సిగదరగ. తెల్లారి లేస్తే నాకదే కూడు మరి.

సుభాన్ : అతని ఇష్టమైతే ఇస్తాడు. లేకపోతే లేదు. అసలు కొట్టడానికి ఈయనెవరంట!

మస్తాన్ ; చాల్లె. దయగల మొనగాడివి బయల్దేరావ్, నీపాటి నాకూ తెలుసు.

సుభాన్ : ఏంటి నీకు తెలిసింది? గొల్లాయన్ని గూబ అదర గొట్టడమా?

మస్తాన్ : నేనుగాబట్టి అంతటితో పోయింది. ఇంకొకడైతే...

సుభాన్ : ఏం అయితే?

మస్తాన్ : దొరకు జెప్పి నిలువునా వీడితిత్తి ఒలిపించేవాడు.



యల్ల : అబ్బో! ఈ దర్మ తండికి పేదోళ్ళమీద ఎంతదయ!

మస్తాన్ : చూడవయ్యా వీరారెడ్డీ. చూడు వీడితల్లో ఎంత పొగరుందో,

యల్ల : దొరగారి గడీలో తేరగా తింటంటే పొగరెక్కింది నాకు!

మస్తాన్ : (కండ్లురుముతూ) ఖబడ్దార్.

యల్ల : తస్సదియ్యా, నక్కను జూసినాడల్లా యేటగాడే. గడీలో అడుగుబొడుగు ముడుసు లేరక తినేవాళ్లు కూడా పెద్ద మొగాళ్ళే.

మస్తాన్ : ఏమిటిరా యిప్పుడు కూసిన కూత, భోసడీక (అంటూ యల్లమందమీదకి వస్తాడు.)

వీరా : (అడ్డంవచ్చి) ఏం? లోకువోడనా మరీ మీద మీద కెళ్తన్నావ్? కాస్త మర్యాద దక్కించుకోవాలి.

మస్తాన్ : మధ్య నీవెవడవోయ్ అడ్డంరావటానికి? అసలు నీకేం సంబంధం?

వీరా : నాకు సంబంధంవుంది. ఇవ్వాళ అతడ్నిగొడ్తావ్. రేపు నన్నుగొడ్తావ్?

యల్లమంద : ఇక కొట్టాలిసిందే మూడు ముంతలు.

మస్తాన్ : ఇట్టాగే వాగుతాఉంటే కొడ్తానా కొట్టి చూపిస్తానా?

సుభాన్ : ఏమిటి పిడకలా?

దాదా : (మస్తాన్ చేయిపట్టుకొని లాగుతూ) నీ దారిన నీవు పోరా బాబూ, ఎందుకొచ్చిన పీడ.

మస్తాన్ : (చేయి విదిలించుకుంటూ సుభాన్వైపు చూచి

కోపంగా) థూ నీ బతుకు తగలెయ్య. పుట్టావ్. ముసల్మాన్ పుటక. (గబగబా వెళ్లిపోతాడు)

యల్ల: ఇక తోలుదుగానిలే రాళ్ల చేలో గుంటక.

దాదా : ఓరి నీ ఎ(ర్రిగాల! ఊరుకో. ఈ మంటమీద దొర దగ్గిరికిబోయి ఈ కాస్తికే గంపంత చేస్తాడు. ఇదెట్టాగూ చిలికి చిలికి గాలివానవుద్ది.

యల్ల: ఏమయితే? కానియ్. చెడ్డ చేనికి మూడుమంచెలా ఏందే?

సుభాన్ : అయితే అయింది. ఈసారి ఐసాపైసా తేల్చుకోవాలిసిందే.

వీరా : ఔనుమరి. ఎన్నాళ్లని ఓపికపడతాం! వంగినకొద్దీ నెత్తికెక్కి తొక్కుతూ ఉంటే!

దాదా : ఏమోనాయనా!

వీరా : మరేం భయంలేదు దాదా! మనమంతా ఇలా కలిసికట్టుగా ఉంటే, వాడుచేసి చచ్చేదేం లేదు.

యల్ల : ఏంది సిన్నయ్యా! సావుకు రెండుసావులా ఏందే?

దాదా : సరే కానీయండి, అయ్యేదేదో అవుద్ది. అన్నిటికీ అల్లాయే ఉండాడు.

[అంతా బయల్దేరబోతూ ఉంటారు. యల్లమంద గొంగళి, ముంత సర్దుకుంటూ ఉంటాడు. ఇంతలో తలగుడ్డ జుట్టుకుంటూ హడావుడిగా రామిరెడ్డి ప్రవేశం.]

రామి : పిరికి నాయాళ్ళు, కుక్కల్లాగా పారిపొయ్యారు. నుంచుంటే తెలిసేది, వాళ్ళ పస నా పస.

[దాదా, సుభాన్, యల్లమందలు ఎగాదిగా రామిరెడ్డివైపు చూస్తావుంటారు.]



వీరా : ఏమిటి రామిరెడ్డీ: ఎవళ్ళా పారిపోయింది?

రామి : ఎవళ్లు జచ్చారు? ఆ అడవారకమే, మన దేశముఖుముతా.

సుభాన్ : ఇంతకూ అసలు జరిగిందేమిటి?

రామి : ఏముంది? కొట్టి పారిపొయ్యారు, ముండల్లాగా.

దాదా : అసలు నీవు ఆ లుచ్ఛాల జోలికెందుకు పోయావు బాబూ!

రామి : ఏముంది? ఇవ్వాళ ఆ గాడిదకొడుకులంతా తప్పతాగి ఉన్నారు. ఆ దుకాణాలు దాటేసరికి అమ్మాయి వెనకమాల జేరి, నోటికొచ్చిన పిచ్చికూతలల్లా కూస్తున్నారు. తీరా వెనక్కితిరిగి చూద్దునుగదా వీళ్లు. ఆమెాయిన పక్కనున్న బండి వసికొయ్య పీకి వెంటదగిలా. పారిపోతా పారిపోతా చేతగాని నాయాలు ఎవడో రాయి విసిరాడు.

(అంటూ తలమీద చేయిబెట్టి చూపుతాడు)

సుభాన్ : (రామిరెడ్డి తలగుడ్డ తీసిచూస్తూ) అరే! పెద్ద గాయంకూడా పడిందే.

యల్ల : అమ్మో, గాయమే!

రామి : బండికాడి కెళ్ళాక నెత్తురంతా కడిగి, అక్కయ్య గుడ్డముసి పెట్టింది.

దాదా : ఇంకానయం. అసలు నవరగంతకే తగలాలిసింది; కాస్తలో తప్పిపోయింది. మరీ మనూళ్ళో సైతాన్ రాజ్యమయిపోయింది.

యల్ల: దెబ్బదేందిలే? ఇయ్యాల తగిల్తే రేపుమానది. అడ్డాలోళ్ళు అచ్చోసిన ఆంబోతులకుమల్లే ఆడోళ్ళ మీదకూ్కడా ఎగబడుతుండ్రి ఇంకెందుకంట బతికి?

సుభాన్: నిజమే యల్లమందా! పరువుబోయాక ఇంకా బతికెందుకు?

వీరా: అయితే ఇంకేం? పరువుగా బ్రతకాలంటే, అంతా సంఘంలో చేరతాం అని ప్రమాణం చెయ్యండి.

సుభాన్: తప్పకుండా మనం అంతా సంఘంలో చేరాలిసిందే. రేపటినుంచి ఇల్లిల్లుతిరిగి అందర్నీ సంఘంలో చేర్పించాలిసిందే.

రామి: ఏదివచ్చినా నేను ముందు నుంచుంటాను బావా!

యల్ల: ఓ! నేనూ సంగం బడతా.

దాదా: పదిమందితో చావు పెళ్ళితో సమానం. మీతో పాటు నేనూ; కానీయండి.

వీరా: బోలో, ఆంధ్రమహాసభకీ జయ్!

తెలుగుబిడ్డా మేలుకోవోయ్,

నైజాము

తెలుగు బిడ్డా లేచి రావోయ్ ॥తెలుగు॥

బందగీర క్తంబు చింది జ్వాలైలేచి
జాగీరుదారులను ఊగించివేసింది ॥తెలుగు॥

రుద్రమాంబ ప్రతాపరుద్రులకు వారసుడ
పౌరుషము చూపించి పరువు నిలబెట్టరా ॥తెలుగు॥



ఈ భూమి నీదెరా ఈ గనులు నీవెరా
ఎవడు ఈనైజాము - ఎవరు ఈ దొరలంత ॥తెలుగు॥

మాడి చచ్చేవారి మతములన్నీ ఒకటె
కొంపలార్చేవారి కుట్రలో పడబోకు ॥తెలుగు॥

కదిలించి బలగాన్ని ఎదిరించి వైరులను
శక్తిచూపించగల సమయమిదె లేలెమ్మ ॥తెలుగు॥

# II

## దివాణం

[రెండు కుర్చీలు ఒక డ్రాయరు, ఒక బెంచీ ఉంటాయి. మంగలి రాముడు ముందుగా వచ్చి, బల్లలు వగైరా తుడిచి సర్దుతూ ఉంటాడు. తెర లేస్తుంది. మస్తాన్ ప్రవేశం]

మస్తాన్ : దొరగారున్నారా ?

రాముడు : సలాం, సలాం మత్తానయ్యా,

మస్తాన్ : దొరగా రేంజేస్తున్నారు.

రాముడు : (గడీలోకిచూచి) అరుగో వత్తన్నారు.

[మస్తాన్ ఒక ప్రక్కకు, రాముడొక ప్రక్కకు తప్పుకుంటారు. దేశముఖు జగన్నాధరెడ్డి ప్రవేశం. కోరమీసం. కాళ్ళకు బూట్లు, షేర్వానీ, సుర్వా (చుడీదార్ పాయిజామా) నల్లటోపీ (fur cap) చేతిలో సన్నటి వెండి పొన్నుగఱ్ఱ]

మస్తాన్ : (నేలకువంగి) ఆదాబ్ మారాజ్, ఆదాబ్

జగ : ఏం? అక్కడనుంచేనా ? (అంటూ కుర్చీలో కూర్చుంటాడు. రాముడు డ్రాయరు కిందగా వంగి దేశముఖు కాలిబూట్లు ఊడదీస్తూ ఉంటాడు)

మస్తాన్ : జీ హాఁ సర్కార్, అక్కడనుంచే-ఆగోరీదగ్గిరనుంచే బరాబర్ : వస్తున్నా.

జగ : (సిగరెట్ కాల్చుకుంటూ) ఏం ? ఎలావుంది ? జనం ఏమాత్రం వచ్చారు ?



మస్తాన్ : రాకేం ? పెద్ద ఉర్సులాగా సాగింది. ఎక్కడ చూచినా మనూరివాళ్ళే.

జగ : ఏమిటి ? మనూరువాళ్ళా ? చాటింపు వేయలా, వెళ్ళ గూడదని ?

మస్తాన్ : ఎందుకేయలా ? మొన్ననే వేయించాం.

జగ : అయితే ఎలా వెళ్ళారు ?

మస్తాన్ : చాటుచాటుగా జచ్చారు.

జగ : ఆఁ అంతపొగరు దిగిందా వీళ్ళకి ?

మస్తాన్ : ఎంత పొగరు దిగందే ఆ వీరారెడ్డి బండి గట్టు కొచ్చాడూ చెల్లెల్ని ఎక్కించుకొని.

జగ : వాడా ? ఆ వెధవ ? నరసిరెడ్డి కొడుకు ?

మస్తాన్ : అసలు కధానాయకుడే ఆయన. పోయేవాడు తాను పోక ఇంటింటికీ తిరిగి అందర్నీ రేపెట్టి తీసికెళ్ళాడు.

(రాముడు బూట్లూ డదీసి దులిపి, అక్కడే పెట్టి లోపలి కెళ్ళిపోతాడు)

జగ : ఏమిటి ? నేను వద్దని చాటింపు వేయించడం, వీడు అందర్నీ తీసుకెళ్ళడమూనా ? తెలుసుకుంటాను వీడ హాజమేమిటో ?

మస్తాన్ : మరీ నీల్గి చస్తున్నాడులెండి, నాల్గచ్చారాలు వచ్చని.

జగ : వాడెంత ? వాడిబిసాదెంత ? నాలుగుతంతే సరి, కోటకు బిల్చి, జావ్, బులావ్, పట్వారీకో

మస్తాన్ : అచ్ఛాసాబ్. (సలాంజేసి మస్తాన్ వెళ్ళిపోతాడు.) రాముడు గ్లాసులు, సారాసీసా తీసుకొచ్చి టేబుల్ మీద ఉంచుతూ ఉంటాడు. పోలీసు ప్రవేశం)

పోలీసు : ఆదాబ్ మారాజ్, అమీన్‌సాబ్ వస్తా ఉండార్

జగ : అచ్ఛా, అచ్ఛా (దేశముఖు లేచి నుంచుంటాడు; అమీన్ ప్రవేశం) ఆదాబ్ అర్జ్ హై.

అమీన్ : ఆదాబ్ అర్జ్ హై.

జగ : ఆయియే తష్‌రీఫ్ రఖియే (షేక్‌హేండ్ ఇచ్చి తీసుకొచ్చి తానుకూర్చుంటూ అమీన్‌ను కూర్చోమని సైగ జేస్తాడు)

అమీన్ : (కూర్చుంటూ) క్యా మహారాజ్, మాకీ తిరణాల్కి వచ్చి మూడు రోజూ హాయిపోయింది. బేగీ పోవాలి.

జగ : అప్పుడే వెళ్తారా ? ఉండండి రేపు వెళ్లొచ్చు.

అమీన్ : మీకీ హేమ్టీ హయ్యా మహారాజ్, హిక్డా హారామ్‌గా కూచోని మాటాసేస్తావ్. మాకీ రేపూ నల్గొండ హెళ్ళాల.

[రాముడు సారా గ్లాసుల్లోబోసి ఇద్దరిముందు పెడతాడు. ఇద్దరూ చెరొక గుక్కతాగి సిగరెట్లు కాలుస్తూ మధ్యమధ్య తాగుతూ ఉంటారు.]

జగ : నిన్నటినుంచి మీరు తిరణాల్లోనే ఉన్నారు. ఇవ్వాళ తప్పకుండా మీ రిక్కడ వుంటారని గానా బజానా కూడా ఏర్పాటు చేశాను.

అమీన్ : నహీఁ మహారాజ్ నహీఁ. ఈదఫా మాకీ సర్కారీ పనీ హుంది. మళ్ళీ వస్తాన్. హిక్డా అయిదు రోజూ ముఖాం చేస్తాం.

జగ : సరే మీ యిష్టం.

అమీన్ : మరి హేమ్టీ మాదీ మాట ?

(రాముడు ఇద్దరి వెనక ప్రక్కన నుంచుని విసురుతుంటాడు)



జగ : (ముసిముసి నవ్వులునవ్వుతూ) దానికేం లెండి (జేబులో నుంచి రెండువందల రూపాయల నోట్లుతీసి ఇవ్వబోతాడు.)

అమీన్ : హేమ్టీ ఇది ? మాకీ బిచ్చం హిస్తుండావ్.

జగ : ఈసారికి ఇలా పోనివ్వండి.

అమీన్ : హేమ్టీ మాటసేస్తావ్ మహారాజ్. నీకీ మాది హెంతా మదద్ ఇచ్చాం. హద్దే మర్సి పొయ్యావ్ !

జగ : ఎంతమాటన్నారు ? ఏదో ఈసారికి ఇలా పోనీయండి మళ్ళీ వస్తారుగా !

అమీన్ : వస్తాం. చస్తాం. కోఁజాన్తాహై, హప్డూ మాటా హద్దే.

జగ : దీనితోసరిపుచ్చుకుందురూ, అప్పుడే మాపని అయిందా ? రేపు మళ్ళీ సర్కిల్ కిచ్చుకోవాలి; పుడ్ తాహసీల్దార్ కిచ్చుకోవాలి. దువ్వం తాలూక్దార్ గారింట్లో పెండ్లికి నజరానా చెల్లించుకోవాలి. ఈ నెల్లోనే అవ్వల్ తాలూక్‌దార్ గారు మా ఇలాకాకు షికార్ కూడా వస్తున్నారు. వారికి జల్సా చేయాలి. సుబేదార్ గారు దౌరాకు బయల్దేరితే ఎంతలేదన్నా మాకు అయిదారు వేల రూపాయలు ఖర్చవుతాయి. మేం మాత్రం ఎన్నని యిచ్చుకుంటాం.

అమీన్ . అవ్వల్ తాలూక్దార్కి, దువ్వం తాలూక్‌దార్కి హిస్తే మాకీ ఏం ఫాయిదా ? మాదీమాట మాకీ సెప్పాలిగాని.

జగ : మీరుకూడా మా యిబ్బంది కనిపెట్టకపోతే ఎలా,

సరే కానీయండి. (మరో వందరూపాయల నోటుతీసి మొత్తం మూడువందలరూపాయలు యివ్వబోతాడు.)

అమీన్ : హిబ్బందీ మట్టీ, మీకీ హేమ్మి. హింతా పెద్దా దేశముఖ్ ఉండావ్. పైనా మీకీ పోలీస్ పటేల్ గిరీ హుంది. మాలీపటేల్ గిరీ హుంది. సాల్ కీ ముప్పై వేల్ నల్పై వేల్ ఆమ్దనీ (ఆదాయం) హుండి. పైనా కొట్టే లంచం కొడ్తానేహుండావ్. మాకీ హొక్కి వెయ్యీహిచ్చేందుక్కా హెనాక్కాముందూ సేస్తుండావ్; క్యా మహరాజ్ ?

జగ : మీరలాగే అంటారు. కాని మా దివాణంలో ఎంత ఖర్చౌందో మీ కేం తెలుస్తుంది? ఎంతచెట్టు కంతే గాలి.

అమీన్ : కాస్తీపస్కీ, కూస్తీపస్కీ మాదీ మదద్ కావాలీ; (కొంచెం ఆలోచించి) దాన్కీ నామ్ క్యాహై? ఆఁ హెంకమ్మ, హెంకమ్మ; గడికీ పిల్చీ మీరూ దాన్కీ పట్కొని హంగామాచేస్తే హప్డూ హదీ సచ్చీ పోయింది. దాన్కీ కేసులో మీకీ మదద్ సేసినంద్కూ నాదీ నౌకరీ పోవడానీకీ తయార్ హైంది. హేమ్టుండీ మంచీకీ మంచీ లేదు. అచ్ఛా, ఈదఫా చూస్తామ్ (అంటూ బెదరించి కుర్చీలోనుంచి లేవబోతాడు.)

జగ : (అమీనును కుర్చీలో కూర్చోబెడుతూ), అది కాదంటున్నానా? సరే, చూస్తానుండండి. (అంటూ లోపలి కెళ్తాడు.

(అమీన్ సారా తాగుతూ వుంటాడు.)



[దేశముఖు ప్రవేశం.]

ఖర్చులో ఉన్నానుగాబట్టి అలా అన్నానుగాని లేక పోతే యేముంది లేండి. (మొత్తం వెయ్యిరూపాయలు యిస్తూ) మీసహాయంమాకెప్పుడూ అవసరమే.

అమీన్ : (తీసుకొని షేర్వానీ జేబులో పెట్టుకుంటూ, అచ్ఛా మహరాజ్. మీకీ హండామాదీ, మాకీ హండామీదీ. వస్తా ఆదాబ్ అర్జ్ (అంటూ కుర్చీలోనుంచి లేస్తాడు.

జగ : ఆదాబ్ అర్జ్. అరేయ్ రాముడూ. అమీన్ సాబ్ గారు వెళ్తున్నారుగాని వెట్టివాణ్ని బండివెంట వెళ్ళమని చెప్పిరా.

రాముడు : సిత్తం దొరా.

[అమీన్ సాహెబ్, రాముడూ వెళ్ళిపోతారు. దేశముఖు గ్లాసులో సారాబోసుకొని ఒక్కొక్క గుటకే తాగుతూ ఉంటాడు. పట్వారీ వెంకట్రావు, మస్తాన్ల ప్రవేశం. వెంకట్రావు :—కట్టుపంచ, చొక్కా, దాని పైన పాతకోటు, ఎర్రటి గళ్ళ తలగుడ్డ, భుజాన ఒకచిన్న తుండు, కాళ్ళకు పాపోసులు (ముచ్చెలు). చంకన దస్త్రం, కళ్ళకుజోడు, దేశముఖు పట్వారీలు పరస్పరం నమస్కారాలు చేసుకుంటారు. పట్వారీని కూర్చోమని దేశముఖు సైగజేస్తాడు. వెంకట్రావు బల్లచివర కూర్చుంటాడు. మస్తాన్ నుంచోనే ఉంటాడు.]

జగ : ఏమయ్యా! మనం చాటింపు వేయించినా లెక్కజేయకుండా వీళ్ళంతా ఉరుసు కెళ్లారటగా?

వెంక : ఔను వెళ్లారు. చాటుఛాటుగా దొంగ వెధవలు.

జగ : అయితే నీవేంచేస్తున్నావ్. కండ్లు మూసుకొని జపం జేస్తున్నావా?

వెంక : కాదు; దానికి తగినప్లాను ఆలోచిస్తున్నాను. (ముసిముసి నవ్వులతో) కళ్ళుమూసుకొని నిద్రబోయే ఘటమేనా ఇది?

జగ : ప్లానట! ప్లాను! దీనికూడా ఒక పెద్దప్లానా? ఒక్కొక్కణ్ణి పిల్చి పక్కలిరగ తన్నేదానికి.

మస్తాన్ : ధొరవారు భలేమాట సెప్పారు. దెబ్బకుగాని దెయ్యంవదలదు. లేకపోతే, గుడ్డిగవ్వ ఖరీదుచేయని గొల్లయల్లమందాయకూడా నాకెదురుతిరిగితే!

జగ : ఏమిటి? గొల్లోడు! గొల్లాడా? ఎదురుతిరిగింది. బులావ్ గాడిదని...జావ్...

(మస్తాన్ సలాంగొట్టి సంతోషపడుతూ వెళ్ళిపోతాడు)

ఏం? వీరారెడ్డి మరీపొగరు దిగి ఏడుస్తున్నాడటగా?

వెంక : ఔను. అసలు నాయకుడే అతను. ఇంటింటికి తిరిగి అందర్నీ సంఘంలో చేర్పిస్తున్నాడు.

జగ : సంఘం? సంఘమా? నావూళ్ళో సంఘంబెట్టాడా?

వెంక : సంఘంబెట్టడమేమిటి? వాడింటి మీదఇవ్వాళ జండా కూడా వెలిసింది.

జగ : అయితే ఇప్పుడుదాకా నీవేం జేస్తున్నావ్? ఎందుకు పీకించల?

వెంక : పీకించేవాణ్ణే. కాని......

జగ : కాని.

వెంక : కాని ఇదివరకటంత తేలికగాదు. వ్యవహారం కొంచెం బెడిసింది.

జగ : ఏం?



వెంక : ఊరంతా ఏకమయింది.

జగ : (కోపంగా) ఆఁ,

వెంక : కాపు, రెడ్డి, చాకలి, మంగలి, సాహెబులు, చివరకు మాలమాదిగలుకూడా సంఘంలో చేరారనుకోండి.

జగ : ఏడ్చారు. గుడ్డికన్ను మూస్తే ఎంత తెరిస్తే ఎంత? రేపీపాటికి ఒక్కొక్కణ్ణి నరికి పోగులేస్తాను. చూడు నాదెబ్బ!

వెంక : మీరు తల్చుకుంటే అంతేగాని అదేం పాపమో ఈ సంఘం నాగజెముడు (పాముపడగ చెట్టు) పురుగులాగా దేశమంతటా వ్యాపించిపోతూ ఉంది. ఏ ఊళ్లో జూచినా ఇప్పుడిదే గోల. తీగ లాగితే డొంక కదిలేటట్లుంది.

జగ : ఈ కుక్కలెన్ని మొరిగితే ఏ ముందయ్యా! (చిరునవ్వు నవ్వుతూ) పైనుంచి కిందిదాకా అసలు సర్కార్ మన చేతిలో ఉంది.

వెంక : అందుకనే. ఆచేసే పనేమిటో వాళ్లద్వారానే చేయిస్తే పీడాబోతుంది.

జగ : అదెట్లా?

వెంక : ఉందిగా, లెవీ సమస్య.

జగ : ఆఁ ఉంటే.

వెంక : అది సర్కారు పని. వాళ్లకీ వాళ్లకీ ముడి బెడదాం. మనం హాయిగా ఒడ్డున గూర్చొందాం. తర్వాత కాగలపని గంధర్వులే తీరుస్తారు.

జగ : షహ్‌బాష్. మొత్తానికి కరణం బిడ్డవనిపించావయ్యా. బట్టతలకి మోకాలికి బలేగా ముడిబెటావ్.

(అంటూ సారా గ్లాసు వెంకట్రావ్ చేతికందిస్తాడు)

[రాముడు ప్రవేశం]

వెంక : (గ్లాసుతీసుకొని ఒకగ్రుక్క త్రాగి) ఈ ఘటానికి ఇలాంటి దొరక లెక్కా! దొరవారి దయ ఉండాలి గాని....

[మస్తాన్ యల్లమందల ప్రవేశం మస్తాన్ సలాంజేసి ఒకప్రక్క నుంచుంటాడు. యల్లమంద వంగి దండంబెట్టి చేతులు గట్టుకొని ఒకమూల ఒదిగి ఉంటాడు]

జగ : అరే రాముడూ! నీవుపోయి రైతుల్ని పిల్చుకురా. (రాముడు సిత్తం దొరా, అంటూ దణ్ణంబెట్టి వెళ్ళిపోతాడు)

వెంక : ఏంరా? యల్లమందా, దొరవారికేటా నీవిచ్చే గొంగళ్లెన్నిరా?

యల్ల :అయిదు బాబయ్యా.

వెంక : మరి ఈ యేడెన్ని ఇచ్చావురా?

మస్తా : వాడిపని ఇచ్చేటట్టుందా ఇప్పుడు?

యల్ల : అదేందిర్యా మత్తానయ్యా అట్టంటవ్, అప్పుడే మూడిత్తినిగా.

జగ : తతిమ్మా రెండెవడిస్తాడురా మాదర్‌చోద్, నీతాత గాడిస్తాడా?

యల్ల : (దండంబెడుతూ) ఇచ్చుకుంటా దొరగారు ఇచ్చుకుంటానండీ.



మస్తా : ఇంకా ఎప్పుడో ఇస్తాడంట ఒకపక్కన అప్పుడే ఉగాదిపండగ వస్తా ఉంటే.

యల్ల : ఇచ్చుకుంటానులే బాబూ, ఈ నెల్లోనే ఇచ్చుకుంటా దొరగారి మామూలు తప్పుద్దా.

వెంక : సరేగాని మందనెక్కడ అపుజేస్తున్నావురా?

యల్ల : నిరుడు పుల్లరికి డబ్బు దొరక్కపోతే యీరారెడ్డిగారి దగ్గిర తీసుకున్నా దొరా, ఆడబ్బుకింద నిన్నా, యియ్యాల ఆరిచేలోనే కుదరేసిన్నాండి.

మస్తా : అరేలుచ్చా, ఎవణ్ణి అడిగితోలావురా వీరారెడ్డి పొలంలోకి?

యల్ల : (దేశముఖుతో) రెణ్ణాల్లు దోత్తే ఆ బాకీ తీరద్దని పోయిన్నయ్యా. ఇయ్యాల దొరగారి చేలోకే పోని తండాగా!

మస్తా : (వెంకట్రావ్‌తో) వీరారెడ్డి వాళ్లసంఘం పెద్దగాదూ! అందుకని తోలాడులెండి.

వెంక : ఏంరా! సంఘంలో జేరబట్టేనా మస్తాన్‌ను గొట్టావట?

యల్ల : నేనా కొట్టింది! రామరామ, ఆయనే నన్ను కొట్టిండండి.

వెంక : తన్నులు దింటావ్, మాదర్‌చోద్, నిజంజెప్పు.

యల్ల : అమ్మతోడండి, ఏబట్టుబడితే ఆ బట్టు (దండంబెడుతూ) మా దేవర తోడండి.

వెంక : ఇంతకూ నీవసలు సంఘంలో చేరావా లేదా?

యల్ల : (చేతులు నలుపుకుంటూ బిక్కమొగం వేసి) నేనా అండీ...సంగంలోనా అండీ...నేనా...

మస్తాన్ : నీవేరా భోసడీక.

యల్ల : ఊఁ... ఊఁ... లే... లేదండి.

వెంక : అరె బద్మాష్, అబద్ధమాడుతున్నావ్, చెప్పునిజం.

జగ : (గుడ్లెఱ్ఱజేసి) ఏయ్ మస్తాన్, ఊఁ (యల్లమందను కొట్టమని సైగజేసాడు.)

మస్తాన్ : (చొక్కా చేతులు పైకెగదీస్తూ) ఏమిటిరా లుచ్ఛా (చెంపబగలేసి) చేరలేదురా?

యల్ల : (దండంబెడుతూ) చేరిన్నండి దొరగారూ చేరిన్నండి. అందరూ చేరతంటె నేనూ చేరిన్నండి.

జగ : చేరావ్, లమ్డికె చేరావ్.

వెంక : కట్టు గాడిద యాభైరూపాయల జరిమానా కట్టు.

యల్ల : పిల్లలుగలాణ్ణి, సచ్చిపోతా. అసలే కరువురోజులు బాబయ్యో, మీపాదాలకు మొక్తా, మీబానిచోణ్ణి.

వెంక : (కాగితంమీద రాస్తు) అయితే యీమాట ఒప్పుకో

యల్ల : ఏం దిబాబూ?

వెంక : ఏముంది? "సంఘంలో చేరకపోతే చంపుతామన్నారనీ, లెవీ ఎగ్గొట్టమన్నారనీ" ఒప్పుకో, నీజరీమానా మాఫ్ చేస్తా.

యల్ల : రామరామ ఆపాపం నేనెట్టా మాటగట్టుకోనండి. వారట్టన లేదండీ.

జగ : మస్తాన్! లోపలికి దీసికెళ్ళి వీణ్ణి స్తంభానికి గట్టేసి బొమికలిరగదన్ను. అప్పుడుగాని ఈ గాడిదకి బుద్ధి రాదు.



[మస్తాన్ యల్లమందను మెడబట్టి లోపలికి గెంటుకెళతాడు. తెరలోనుంచి 'ఒప్పుకో ఒప్పుకో' అనే మస్తాన్ మాటలతోపాటు కొరడాదెబ్బల మోత, అమ్మో బాబో చచ్చాన్రో. నాయనో అనే యల్లమంద ఆర్తనాదం వినబడుతూ వుంటుంది.]

యల్ల : (తెరలో) ఒప్పుకుంటానండి. చంపకండి, బాబో మీ పాదాలకు మొక్తా. పిల్లలుగలాణ్ణి, మీరు జెప్పినట్టే జేస్తా,

(దేశముఖు పట్వారీలు వికటంగా నవ్వుతూఉంటారు.

(యల్లమందతో మస్తాన్ ప్రవేశం)

వెంక : ఆఁ, రా. ఈ కాగితంమీద అంగుషం వెయ్.

మస్తాన్ : వెయ్ భోసడీక (అని యల్లమందచేత బలాత్కారంగా వేలుముద్ర వేయించి మెడబట్టిగెంటుతూ) ఖబడ్దార్. వల్లుదగ్గిర బెట్టుకోని బతుకు పో. (యల్లమంద ఏడుస్తూ వెళ్లిపోతూ ఉంటాడు) ఈమధ్య వీడికి కాస్త వల్లు చిమచిమ లాడింది.

వెంక : వీడి దేముంది? అసలాళ్ళంతా ఇంకా అలాగే ఉన్నారు.

మస్తాన్ : ఇయ్యాళ ఒక్కొక్కడు నెత్తుగుకక్కాలి రానీ.

జగ : కాని, నీ యిష్టంవచ్చినట్టుగానీ. నేను మళ్లీ ఇప్పుడే వస్తాను.

(దేశముఖు లోపలి కెళతాడు)

వెంక : రాముడెళ్లి చాలసేపయిందే. రైతులింకా రాలేదు.

(అంటూ పొగచుట్ట ముట్టించి కాలుస్తూ ఉంటాడు.)

మస్తాన్ : దొరలు-వాళ్ళపని ఇప్పుడు పిలిస్తే వచ్చేటట్టుందా!

వెంక : అందరిమాట అలాఉంచు. నీ తమ్ముడుకూడా అందులోనే కలిశాడటగా.

మస్తాన్ : ఎందుకు కలవడు కాఫిర్ ముండాకొడుకు. ఆ వీరారెడ్డితో దోస్తీ ఊరికే పోద్దా? (ప్రక్కకు జూచి) అరుగో దిగుతున్నారు దొరలు'

[వీరారెడ్డి, రామిరెడ్డి, సుభాన్, దాదాల ప్రవేశం.]

దాదా : సలాం మారాజ్.

వెంక : నూర్చుకొని ఇంట్లో పోసుకోగానే సరిపోయిందీ? ఎన్నిసార్లు కబురు పంపినా ఒక్కళ్ళూ లెవీ ఇవ్వరు.

వీరా : అసలు పండితేనా నూర్చి ఇంట్లో పోసుకోడానికి?

వెంక : అదేమిటయ్యా వీరారెడ్డి, చదువుకున్నవాడివి నీవు కూడా అలా మాట్లాడుతావ్? ఏది తప్పినా సర్కార్ లెవీ తప్పుతుందా?

దాదా : పండితే ఎందుకియ్యం. ఏటా ఇయ్యాటల్లేదండీ.

సుభాన్ : సర్కార్ మాత్రం పండందే ఎట్లా వసూలు జేయమంటారు?

(మస్తాన్ తమ్ముడివైపు చురచుర చూస్తూ ఉంటాడు.)

వెంక : ఆ ఖానూన్ (లా) గొడవ నీకేం తెలుసునోయ్! కౌలంటే, పాలంటే దొరగారితో పనిగనక, ఏదో ఒకవిధంగా జెప్పి కొన్నాళ్లు నెట్టికెళతాను. ఇదేం అడ్డగోలుగాదు; సర్కారుతో పని.

రామి : ఇంకా నెట్టికెళ్ళేదేమిటి! ఆపండిన నాలుగుగింజలూ కాపలాబెట్టి కల్లందగ్గిరే గుంజకెళ్లారాయె. మాకు మిగిలిందేముంది. పొల్లూ పొలకట్టేగా.



వెంక : మిడికావ్ లేవోయ్! అసలు మీరు బుద్ధిపూర్వకంగా యిస్తే ఎందుకు గుంజుకెళతారు? అయినమట్టుకు దిగమింగడమేగా మీ పని.

సుభాన్ : అసలు మీరు మిగలనిస్తేనా? మేం దిగమింగి చచ్చేదేమిటి?

వెంక : అందాకా ఎందుకు? ముందు నీ మాటజెప్పు. ఆ రేండ్ల కింద తీసుకున్న బాకీ నీ వింతవరకూ తీర్చావ్?

సుభాన్ : మా అయ్య జచ్చినప్పుడెప్పుడో ఒక బస్తాగింజలు నాకు కిచ్చావ్. ఆ బాకీకింద ఇప్పటికి 14 బస్తాలు జమకట్టాను. ఇంకా 14బస్తాలు బాకీ ఉందంటావ్. ఈ బాకీ మరి ఎప్పుడు తీరుద్దో, ఏమిటో?

రామి : (సుభాన్‌తో) ఒకటే తీరడం. ఇక నీవు జచ్చినప్పుడే తీరేది.

వెంక : మొదటే ఎక్కడికి పోయాయి ఈ తెలివితేటలు? ఆవేళ అయ్యో, బాబో అని కాళ్లావేళ్లాబడి పట్టుకెళ్లడం. తీరా యివ్వాళ ఇవ్వాలిసొచ్చేటప్పటికి ఇదీ ఏడుపు. ఇందులో నేనేమన్నా దగా జేశానంటావా? కావాలంటే నీ వీరారెడ్డితోనే లెక్కజూపించుకో.

వీరా : దీనికి లెక్కతో పనేముందిలేండి. ఆరు సంవత్సరాల క్రింత పట్టుకెళ్లింది బస్తాగింజలు. ఇప్పటికి 14 బస్తాలు ఇచ్చాడు. ఇంకా 14 బస్తాలివ్వాలంటే ఎలా ఇచ్చుకుంటాడు? ఇంతకంటెఅన్యాయం యింకేం ఉంటుంది?

వెంక : అయితే ఇంకేం. నీవుమళ్లీ కొత్తగా ఒకఖానూన్ తయార్ చెయ్.

వీరా : ఈజరిగే దంతా ఖానూన్ ప్రకారమే జరుగు తూందా ? పోలీసు అమీన్ను విందుచేయడానికి గొల్లోడి మేకనెత్తుకరమ్మని ఏ ఖానూన్‌లో ఉందండీ ?

రామి : భలేమాటజెప్పావ్, ఇంటికొక బండిఎరువు వూరికే వీరికివ్వాలని ఎక్కడ రాసిపెట్టుందో !

సుభాన్ : (వీరారెడ్డి వైపుజూచి) ఏం భాయ్ ! దున్నేదున్నే అరకలూడదీసి, పోయి దొరగారి పొలం దున్నాలని కూడా ఖానూన్‌లోనే ఉందా ?

వీరా : (వెంకట్రావుతో) ఖానూన్‌కేం వచ్చెలెండి, నిరుడు మీ అమ్మాయిగారి పెండ్లికి ఇంటికి ఐదు రూపాయల చొప్పున వసూలు జేశారుగదా. ఇంకా ఖానూన్ ఏమిటండీ ?

వెంక : చాల్లే. పోసుకోలు కబుర్లు ; తాతలనాటినుంచీ వచ్చే మామూళ్లు ఇవ్వాళ పొమ్మంటే పోతాయా.

సుభాన్ : వీలయితే ఖానూన్. లేకపోతే మామూల్. ఔనులే ఎన్ని మామూళ్లు లేకపోతే అంతమేడ కట్టారు ?

దాదా : ఎందుకొచ్చిన పంచాయితీ ఇది సుభాన్, వచ్చిన పనేదో చూసుకోక.

వెంక : మీతో నాకెందుకొచ్చినగొడవ యిదంతా! ఏమోయ్ దాదే సాయిబూ ! మీరంతా రేపుప్రొద్దునే లెవీ ధాన్యం కొలవాలి. లేకపోతే యిక మాట దక్కదు.

దాదా : కొలవ కేంజేస్తాంగాని, అసలు పండందే ఏంజేస్తాం ?

సుభాన్ : అసలు చెరువులోనీళ్ళు నిలిస్తేనా పండటానికి ?



రామి : నిలిసినన్ని నిలుస్తయ్; వారికిచాలుగా. మనం ఏ గంగలో కలిస్తే ఎవరి కేంబట్టింది ?

వెంక : ఈ పిచ్చిపిచ్చి వేషాలేమీ సాగవ్. వడ్లుపండకపోతే జొన్నలు కట్టండి; జొన్నలుపండకపోతే సజ్జలుకట్టండి.

సుభాన్ : సజ్జలెవడికిపండినయ్ ఈవూళ్లో. మీకే పండ లేదాయె?

వెంక : అయితే జొన్నలుగట్టండి.

దాదా : ఆజొన్నగింజలుకూడా బెట్టపదున్నే పడ్డాయ్. అక్కడొక మొక్కా అక్కడొక మొక్కా మొలిస్తే, పండిన వాడికి కాసిని పండాయ్; లేనివాడికి అదీలేదు.

వెంక : బెట్టపదునులో వేయకపోతే పసర పదున్నే వేయక పోయారు. ఎవడొద్దన్నాడు ?

రామి : వద్దని ఎందుకనాలి ? కట్టిన అరకల్ని ఊడదీయించి ఆ పదునున్న నాలుగురోజులూ దొరగారి పొలం దున్నించుకున్నారు, చాలదూ ?

వెంక : ఏమిటీ సోది ? ఇన్నిటికీ కడ్తారా చెంబూతప్పేలా బైటేయించాలా ?

వీరా : ముందు నిరుడు వసూలుచేసిన మా లెవీ డబ్బు మాకివ్వండి, ఈ యేటిసంగతి తర్వాత చూద్దాం.

వెంక : ఆ డబ్బు ఇన్నాళ్లుందా ఏమిటి ? అప్పుడే యిచ్చాం వార్ ఫండుకి.

సుభాన్ : ఎవర్ని అడిగి ఇచ్చారు ?

వెంక : నిన్నడిగి ఇచ్చేదేమిటోయ్! కావాలంటే పోయి పంచా యితీదారుల్ని కనుక్కో.

వీరా : అది మా డబ్బు. పంచాయితీ దార్లెవరు దాన్ని ఖర్చు పెట్టడానికి ?

రామి : అయితే ఇంకేం. అత్తసొమ్ము అల్లుడు దానం జేశా డన్నమాట ?

వెంక : ఎవడో ఒకడు చేశాడు : పోయి సర్కారునడుగు.

వీరా : సర్కారు నడిగేదానికి ఇక్కడదాకా రావడమెందుకు? పదండి పోదాం.

(వీరారెడ్డితోపాటు అంతా బయల్దేర బోతారు)

వెంక : ఏం, అయితే మీరు లెవీ ఇవ్వరన్నమాటేగా ?

వీరా : ముందు ఆరువందల యకరాలున్న మీరు గట్టండి.

వెంక : (కోపంగా దిగ్గున లేచి) ఏమిటి !

సుభా : ఏమిటా ? ఆరువందల యకరాలున్న మీరూ, ఇరవై వేల యకరాలున్న మీ దొరగారూ ముందు కట్టండి; తర్వాత మమ్మల్ని అడగండి.

వెంక : మాఇష్టం, కడతాం, కట్టం. మీరెవళ్లు రాఅడగడానికి.

వీరా : మాటలు కాస్త జాగ్రత్తగా రానీ !

మస్తా : ఏయ్ (అంటూ వీరారెడ్డిమీదకు పోతాడు)

సుభా : ఖబడ్దార్ !

(మస్తా కటుక్కున ఆగిపోతాడు. వెంకట్రావు తెల్ల మొగంవేసి వెనక్కి రెండడుగులేస్తాడు.)

[తెరబడుతుంది]

---

# III

## వీరారెడ్డి ఇల్లు

(ఒకకుర్చీ, నులకమంచం, దానిపైన ఒకదిండూ ఉంటాయి. భారత మాత, జాతీయ నాయకులు ఆంధ్రమహాసభ నాయకుల ఫోటోలు గోడలకు తగిలించి ఉంటాయి. వీరారెడ్డి చెల్లెలు కమల ఉయ్యాల తొట్టి నూపుతూ పాటపాడుతూ ఉంటుంది)

జోజో సుందరరూపా
జోజో మా కులదీపా
స్వాతంత్ర్యమును నీవె
సాధించుమో పాప ॥జోజో॥
తెలుగు బిడ్డల ఘనత
నిలుపవలెరా చరిత ॥జోజో॥
బాలచంద్రుని మించి
పౌరుషము చూపించి
వైరి మూకల ద్రుంచి
పాశాల తెగ ద్రెంచి
నీ కీర్తి చంద్రికల
నీ దేశ సంపదల
నెలకొల్పరా మరల
తుల దూగవలె సిరుల ॥జోజో॥

[పాట పూర్తి అవుతూ ఉండగానే వీరారెడ్డి భార్య సీతమ్మ ప్రవేశిస్తుంది.]

సీత : ఈ పిచ్చిపాటలు పాడమంటే ఇక కూడూ నీళ్లూ ఏం అక్కరలా.

కమల : ఏం ? నీకీ పాట ఏమీ బాగుండలేదా వదినా ?

సీత : ఆ బాగూ ఓగూ ఏమీ అన్నా చెల్లెలికి తెలియాలి. నాకేం తెలుస్తుంది లే అమ్మా !

[వీరారెడ్డి ప్రవేశం]

కమల : (లేనికోపాన్ని నటిస్తు) ఏమిటయ్యా, నాకీపిచ్చి పాటలన్నీ నేర్పావ్.

వీరా : పిచ్చిపాటలూ ! పిచ్చిపాటలేమిటి ?

కమల : వదిన అంటల్లా ? పిచ్చియన్నీ నాకు నేర్పి మంచిపాటలన్నీ వదినకు నేర్పుకున్నావేం ?

సీత : చాల్లే ఊరుకో.. ఈ పిల్లకి మరీ పెద్దా చిన్నా లేకుండా బోయింది.

కమల : ఏం అన్నయ్యా ? నేర్పావ్ నాకుకూడా ?

వీరా : నేను నేర్పడమెందుకు ? వదిన్నే నేర్పమను.

కమల : (జాలిగా బతిమాలుతూ) వదినా, నేర్పవ్ ?

సీత : నోరుముయ్ గాలిపిల్లా.

కమల : నీవు నేర్పకపోతే ఆగుతుందనుకున్నావేం ? రోజూ నీవుపాడేటప్పుడు నేను వింటల్లా ?

వీరా : అయితే ఇంకేం, పాడు.

(కమలను పాడవద్దని సీతమ్మ మొగం చిట్లిస్తూ వ్రేలు చూపుతుంది.)



కమల : వదినవంకజూస్తూ, నవ్వుతూ ఉయ్యాల నూపుతూ

జో అచ్యుతానంద జోజో ముకుందా
రార పరమానంద రామగోవింద॥

సీత : నోరుమూస్తావా లేదా ? అసలు నిన్ను.............

[అంటూ మీదికొస్తుంది. కమల గంతులు వేసుకుంటూ వదినకు దొరక్కుండా ఉయ్యాలచుట్టూ తిరుగుతూ పాడుతూనే ఉంటుంది. వీరారెడ్డి పకపకా నవ్వుతూఉంటాడు. పాట అయిపోగానే కమల నవ్వుతుంటూ అన్నచాటున చేరుతుంది ]

సీత : మీరుగాదూ, అసలు ఆ పిల్లకింత అలుసిచ్చింది. ఎక్కడికి పోతుందిలే మీచాలు.

వీరా : మా అమ్మాయికి మాచాలురాక, మీచాలువస్తుందా?

సీత : కనపడతానే వుందిగా వాదగొండి చాలు.

కమల : (అన్న చాటునవుండే) మాది వాదగొండి చాలయితే మరి మీదో ?

సీత : అట్టాగే పేలుతావుండు. అన్నని అవతలికి పోనీ, చెప్పుతా నీ పని.

కమల : కొడ్తావా ? కొడ్తే అబ్బాయినెత్తుకోనుగా !

సీత . ఎత్తుకోకపోతే నీ పున్నెమాయలే. అబ్బాయికి నీ బుద్ధీ నీ అన్నబుద్ధీ అబ్బకుండా ఉంటే అంతే చాలు.

కమల : మీ అన్న బుద్ధి రావాలా ?

సీతమ్మ : మా అన్న బుద్దేవస్తె బాగానే బతికిపోతాడు.

కమల : ఇకరాక రాక మీ చాలే రావాలమ్మా!

సీత : (నవ్వుతూ) ఏం మా చాలువస్తె నీ కూకురునివ్వావా మా యబ్బాయికి ? సరే ఇయ్యకపోతే మాల్లె.

కమల : (సిగ్గుతో తలవంచుకొని) ఏ ఫో, నీకెప్పుడీమాటలే!
(అంటూ లోపలికెళ్ళిపోతుంది.)

(సీతమ్మ, వీరారెడ్డి నవ్వుతూ కమలవైపు చూస్తూవుంటారు.

సీత : అచ్చంగా అత్తయ్యా నడకే.

వీరా : అవును. అంతా మా అమ్మే.

సీత : అందుకనే అమ్మ కోరిక తీర్చారుగా.

వీరా : ఏం?

సీత : ఇంకా ఏమంట ఏం? అమ్మాయి పెండ్లి కళ్ళతో చూడాలని పాపం ఎంతో మొత్తుకుంది ఆమె. విన్నారూ మీరు?

వీరా : మా అమ్మ చచ్చిపోయేటప్పటికి దానికి పదేండ్లన్నా లేవు. అప్పుడే ఏం పెళ్ళి?

సీత : ఇంకానయం!?అమ్మాయికప్పటికి పదేళ్లన్నా ఉన్నాయి; నా పెళ్ళినాటికి నాకారేళ్లేగా?

వీరా : అందుకనే ఊరుకున్నావ్. లేకపోతే ఈ దేశాలు పట్టుకొని తిరిగేవాణ్ణి చేసుకునే దానివేనా?

సీత : చాల్లెండి! ఏంటా మాటలు? ఆడకాడికీ మరీ చిన్నపిల్లలై పోతన్నారే!

వీరా : ఏముంది? ఉన్నమాట అన్నాను.

సీత : మాటలకేమొచ్చె. ఇప్పుడైతే మీరు మట్టుకి చేసుకునే వాళ్లా ఏమిటి ఈ చదువురాని పిల్లని? ఎవళ్లదృష్టం ఎవళ్లు దప్పిస్తారు?

వీరా : అటే జూస్తె నీక్కూడా మా అమ్మకిబట్టిన చాదస్తమే పట్టినట్టుంది.



సీత : మీ కట్టాగే కనబడుతుంది లెండి; అమ్మాయికంటె ఏడెనకల బుట్టిన పిల్లలందరికీ పెళ్ళిళ్ళయినాయి. ఎంకమ్మ వదినగారి పెద్దమ్మాయి మన కమలతోటిది గాదూ? దానికొక కూతురు...మళ్లీ ఇప్పుడు...

వీరా : (నవ్వుతూ) ఓహో కమలకు పెళ్ళిచేసి త్వరగా కోడల్ని చూసుకోవాలని ఉందన్నమాట నీకు.

సీత : చాల్లెద్దురూ మీ సరసం; కష్టం సుఖం ఏమీ ఆలోచించరు. ఇంతకూ మీ అమ్మేఉంటే నాకీ చిక్కే ఉండదు.

వీరా : ఏం? ఇప్పుడు వచ్చిన చిక్కేముంది?

సీత : ఎన్నిజెప్పినా పరాయి అమ్మగన్న బిడ్డని, ఏ కాస్త లోపంవచ్చినా తలా ఒకమాట నన్నంటారు. మీకేం, మొగాళ్లు.

వీరా : (నవ్వుతూ) పిచ్చిదానా, నింద నీకొస్తే ఒకటీ, నాకొస్తే ఒకటీనా? ఇది తొందరపడితే అయ్యేపనా? తగిన సంబంధం దొరకొద్దూ!

సీత : దొరకడానికి అసలు మీరాలోచిస్తేనా? మీపనేమో మీరేమోగాని, ఎక్కడకెళ్లినా అమ్మలక్కలంతా "ఇంకా నీ ఆడబిడ్డ నెన్నాళ్లు అట్టిపెడతారమ్మా పెండ్లి చేయకుండా. ఆయనకి తెలియకపోయినా నీకన్నా తెలియదా?" అనేవాళ్లే. ఏం చేయను? తలకాయవంచుకొని బైటికి రావలసి వస్తావుంది.

వీరా : లోకులకేం ఎన్నిఅయినా అంటారు. అంతమాత్రాన మనం వులిక్కిపడితే ఎలా? సరే, ఈయేదు తప్పకుండా చేద్దాంలే.

సీత : మరి ఎక్కడన్నా మాట్లాడారా ?

వీరా : ఆఁ. హుజూర్ నగర్‌లో.

సీత : ఎన్నేళ్లుంటాయి అబ్బాయికి ? ఆస్తి ఏమన్నా ఉందా ?

వీరా : ఆఁ తిండికీ గుడ్డకీ ఏం లోపం ఉండదులే. కుర్రాడు ఖమ్మంలో చదువుతున్నాడు.

సీత : ఎట్టా వుంటాడు ?

వీరా : అమ్మాయికంటె ఒకఛాయ తరుగనేకాని, కుర్రాడికేం బాగానే ఉంటాడు.

సీత : దానిపాడుగాను, ఛాయకేంవచ్చెలెండి, కొరుక్కు తింటామా. ముక్కూ మొగం సరిగ్గా ఉండాలిగాని. మాగమాసంలో మంచి లగ్గాలుండయ్యటగా ?

వీరా : అందాకా ఎందుకు ? ఆ కుర్రాడు పదిరోజుల్లో ఇక్కడికే వస్తాడు.

సీత : అప్పుడే ఇక్కడకెట్టా వస్తాడండి; మీదంతా మరీ విడ్డూరం.

వీరా : ఇక్కడే అన్నీ మాట్లాడొచ్చు రమ్మన్నాను. పనిలో పని అమ్మాయిని అబ్బాయి చూడొచ్చు, అబ్బాయిని మీరూ చూడొచ్చు.

సీత : అదేంటండీ పెండ్లికొడుకే వచ్చి మాట్లాడుకోవడమేమిటి ? వాళ్ల తరఫున పెద్దాళ్లెవళ్లూ లేరూ ?

వీరా : ఇది వెనకటికాలం గాదు. ఇప్పుడు పెళ్లిళ్లంతేలే.

సీత : అవునులే. మీకొక ఆచారం ఉందిగాబట్టి ఇదిలేదనా ? సరే ఇదికూడా మీ ఇష్టం వచ్చినట్టే కానియ్యండి. ఎట్టాగోఒకట్టా ముందా మూడుముళ్లు బడితే తర్వాత చూద్దాం.



వీరా : ఇఁదాకావచ్చినాక ఇంకా ఆగుతుందా ? మాఘమాసంలో కాకపోతే చైత్రమాసంలో అవుతుంది.

సీత : ఇంకా నయం. చైత్రమంటారు, వైశాకమంటారు. ఆ పిల్లనెతిన ముందా చిట్టెడుగింజలు పడేదాకా నాకేం తోచదు.

వీరా : ఏం ?

సీత : ఇంకా ఏమంటారేమిటి ? మొన్న తిరణాల్లో ఆ సచ్చినాళ్ళు ఎంటపడిన పట్టానికి మన రామయ్యే లేకపోతే మా బతుకేమయ్యేది ! నాకు మొదటినుంచీ బయంగానే ఉంది. అందుకనే "పెండ్లిగాని పిల్లని తీసుకొని తిరణాలకు నేనెందుకండీ" అని గోలబెట్టా, వినిపించుకుంటేగా !

వీరా : ఆ వెధవలకి జడిసి ఇంట్లోనే కూచుంటామా, ఎక్కడికీ వెళ్లకుండా ?

సీత : ఏం జేస్తాం కూచోక. దుష్టుడికి దూరంగా ఉండమన్నారు పెద్దలు.

వీరా : ఎక్కడుంటావ్ దూరంగా. లొంగినకొద్దీ మరీ నెత్తికెక్కుతారు. ఆ గాడిదలింటిమీద మాత్రం వచ్చిపడగూడదా ? ఇలాంటి వెన్ని జరగలా ఇదివరకీవూళ్లో.

సీత : ఎందుకు జరగలా ? ఆపాపిష్టోళ్ళు ఎంతపని అయినా చేస్తారు.

వీరా : అమ్మాయికంటే ఇవ్వాళ గబగబా పెళ్ళిజేసి బైటికి పంపించామే అనుకో, రేపు నీజోలికే వస్తారు, అప్పుడైనా ఎదరించక తప్పదుగా.

సీత : ఆకాడికొస్తే చావనన్నా చస్తాగాని ఆనచ్చినోళ్ళకి చిక్కకేం?

వీరా : చచ్చి ఎవర్ని సాధిస్తావ్. ఎదిరించి వాళ్ళకి తగిన బుద్ధి చెప్పాలి గాని.

సీత : ఏం ఎదిరిస్తాం, ఆడోళ్ళం?

వీరా : మీరు తల్చుకుంటే ఈ రౌడీలొక లెక్కా? నిరుడు మల్లారెడ్డిగూడెంలో ఏం జరిగింది? మిలటరీ వచ్చి ముట్టడేస్తే ఊరంతా కలిసి ఎదిరించారు, ముఖ్యంగా స్త్రీలుకూడా ప్రాణానికి తెగించి ముందునుంచుని పోట్లాడారు. అనేకమంది తుపాకి కాల్పులకు గురి అయ్యారు.

సీత : (ఆశ్చర్యంగా) ఏమిటి? ఆడోళ్ళుకూడా పోట్లాడారా?

వీరా : ఆఁ పోట్లాడి ముగ్గురు చచ్చిపొయ్యారుకూడా.

సీత : ఆఁ ఎంతదైర్యం చేశారు!

వీరా : ఏం? నీవుమాత్రం చెయ్యవ్. మొన్న తిరణాల దగ్గిర సమయానికి రామిరెడ్డి ఉండడే అనుకో; అప్పుడు నీవేం చేసేదానివి? అమ్మాయిని అల్లరిచేస్తూ ఉంటే చూస్తూ ఊరకునే దానివా?

సీత : నాబొందిలో ఊపిరుండగా అమ్మాయిమీద చేయి బడనిస్తానా?

వీరా : షెబాస్! ఎప్పటికైనా అంతే అనుకో, మీ అంతట మీరు నిలబడాలిగాని ఒకళ్ళమీద ఎందాకా ఆధార పడతారు?

సీత : ఎందుకు నిలబడం? మీతోపాటే మేం.



వీరా : అయితే ఇంకేం? నీవుకూడా సంఘంలో జేరు. కమలా!...కమలా! (కమల లోపలనుంచి "ఆఁ" అంటూ వస్తుంది.) సంచిలో సభ్యత్వ పుస్తకం ఉంది గాని, తీసుకురా, మీ వదిన సంఘంలో చేరుతుంది.

కమల : (ఆశ్చర్యంగా) మా వదినా? (సీతమ్మవైపు చూచి) ఏం వదినా! (సీతమ్మ నవ్వుతుంది.)

వీరా : ఊఁ (కమలను పుస్తకం తెమ్మని సైగజేస్తాడు, కమల రివ్వున లోనికిపరుగెత్తి పుస్తకం తెచ్చి వీరారెడ్డి చేతి కిస్తుంది. వీరారెడ్డి పుస్తకంలో సీతమ్మ పేరూ వగైరా రాస్తూంటాడు.)

కమల : ఏం వదినా, సంఘంలో చేరగానే సరిపోదు. నాతో పాటు నీవుకూడా మనాళ్ళందర్నీ సంఘంలో చేర్పించా లమ్మా!

సీత : (వీరారెడ్డి వంకజూచి నవ్వుతూ) చేర్పించక తప్పు తుందా? సంఘంలో జేరాక సంఘం పెద్ద జెప్పిన మాట' వినాలిగా మరి.

[వీరారెడ్డి నవ్వుతూ, పుస్తకం కమలచేతికిస్తూ వదినచేత వేలిముద్ర వేయించమని సైగజేస్తాడు. కమల వదినచేత వేలిముద్ర వేయించి హుషారుగా పుస్తకం పై కెగరేస్తూ పాటపాడుతుంది.]

ఓమాతా...ఓభారతమాతా
కదనభూమి కురుక నేడె
కదిలినాము ఓహో మాతా ఓ॥మాతా॥
వదలుమమ్మ నీదుచింత కదలినా మిదే
గదిమి అరుల గూల్చెదమమ్మా

ఝాన్సిలక్ష్మి రుద్రమాంబ
శౌర్యపటిమ చాట నిదే
కదలినాము ఓహో మాతా    ఓ॥మాతా॥

కమల : (పాట అయిపోవడంతోనే వదినను కౌగలించుకొని) నీవుకూడ పాడాలమ్మా యిక సంఘం పాటలు.

[దాదా ప్రవేశం]

సీత : (కమల తలమీద చేయివేసి నిమురుతూ) నేనేం పాడతానే! నాకు రావుగా.

కమల : నేను నేర్పుతానుగా.

దాదా : (నవ్వుతూ) నేర్పమ్మా నేర్పు, ఆడబిడ్డ అర్ధమొగుడని ఊరికే అన్నారూ మరి.

సీత : ఏంనేర్పినా రేపువచ్చే మాగమాసందాకానేగా, పద తలదువ్వుతా.

దాదా : అదేంటమ్మాయ్, అట్టంటావ్ ?

సీత : అమ్మాయికి సంబంధం కుదిరింది దాదా ? (వీరారెడ్డి వంకజూచి) తమ్ముడు జెప్పకుండా ఉన్నాడంటలే.

(సీతమ్మ, కమల వెళ్ళిపోతారు.)

వీరా : అదే మొన్న నీకు జెప్పిన సంబంధమేలే. ఊళ్ళో కబుర్లేమిటి ?

దాదా : ఏమున్నాయి! మరీ మామస్తానకి పోయేకాలం వచ్చినట్టుంది.

వీరా : ఏం మళ్ళీ ఏమన్నా జేశాడా ?

దాదా : ఎనకటికిమల్లె మళ్ళీ కోడిపెట్టలకోసం పోయి గూడెం మీద పడ్డాడు. వాళ్ళు నలుగురూ పోగై తలా ఒక తన్ను తన్నారు.



వీరా : మంచిపని జేశారు.

దాదా : ఇక అక్కడేం ఏడవలేక ఇంటికొచ్చి ఇదంతా సంగంవాళ్ళే చేశారని నిన్నూ, నన్నూ, సుభాన్నూ గలిపి నోటికొచ్చినట్లల్లా తిడతన్నాడు.

వీరా : అంతేలే. అంతకంటె అతను చేయగలిగిందేముంది ?

దాదా : ఆ పెద్దమనుషుల్ని ఎందుకు తిడతావని వాడిపెండ్లాం ఏదో శాస్త్ర కలుగజేసుకొంది. ఆమోయిన ఆ పిల్లను బట్టుకొని పాపం చావచితకకొట్టాడు దరిద్రుడు.

వీరా : ఏమీచేతగాని ఇలాంటి వెధవలందరికి చివరికి పెండ్లాం లోకువ!

దాదా : అంతే చివరికి ఉరిమి ఉరిమి మంగలంమీద పడ్డటుంది.

వీరా : అమ్మాయి ? కమలా ! కాసిని మంచినీళ్ళు తీసుకురా అమ్మా.

[యల్లమంద ప్రవేశం, వంటిమీద అక్కడక్కడ సున్నం రాసి వుంటుంది.]

దాదా : ఏం యల్లమందా ఎట్టా వున్నావు?

యల్ల : (దెబ్బలు చూపెడుతూ) ఇట్టాఉండా మత్తానయ్య దయవల్ల, (అంటూ ఉయ్యాలదగ్గరకువచ్చి) ఏం సిన దొరా, నిద్దురోతుండావా ?

సీత : (మంచినీళ్ళు తీసికొస్తూ) లేపవాకు యల్లమందా, ఏడ్చి ఏడ్చి ఇప్పుడేపండుకున్నాడు. (మంచినీళ్ళ గ్లాసును వీరారెడ్డి కందిస్తుంది. గ్లాసునందుకొని వీరారెడ్డి మంచినీళ్ళు తాగుతూ ఉంటాడు. సీతమ్మవెనక కమల కూడా ప్రవేశిస్తుంది.)

యల్ల : (నవ్వుతూ) ఇంకా రెండేళ్లుపోతే మా సిన్న దొర కూడా సంగం పెడతడు.

వీరా : (నవ్వుతూ) ఏమిటి యల్లమందా! ఈ అలవాటు? చిన్నప్పటనుంచీ దొరా దొరా?

యల్ల : ముద్దుకు పిల్చుకుంటన్నలే అయ్యా.

వీరా : సరేగాని ఆ చేతిమీద దెబ్బేమన్నా తగ్గిందా?

యల్ల : (దెబ్బ జూపెడుతూ) అన్నీ తగ్గినయ్‌గాని, దీని దుంప దెగ ఇదే కాస్త ఇంకా నెప్పిగావుంది.

సీత : ఏది యల్లమందా? (దగ్గరకొచ్చి యల్లమంద చేతివైపు జూచి) అబ్బా! ఎంత కదుంగట్టింది! కమలా లోపలి కెళ్లి.. ...అదేమిటి!......అదేనే

కమల : అమృతాంజనమా!

సీత : ఊఁ అదే, ఆ సీసే, తీసుకరా. (కమల లోపలికెళుతుంది)

యల్ల : (దాదావంకజూచి) యేంలేదుగాని సిన్నయ్యా ఒక బుద్దితక్కువ పనిజేసిన్నే.

దాదా : ఏం జేశావ్.

యల్ల : ఆ చుంచుముట్టోడు నాచేత యేలద్దించుకున్నడే.

కమల : (సీసా తీసుకొస్తూ) చుంచుముట్టోడెవడు?

యల్ల : ఉండాడులే అమ్మ. ఉండాడు. ఒక పిలకోడు.

వీరా : ఆ కాగితపు ముక్కతో ఆ పట్వారీ చేసి చచ్చేదేమీ లేదులే. భయపడకు.

యల్ల : (సంతోషంగా) యేమీలేదుగంద.

[కమల చేతిలోనుంచి సీతమ్మ సీసా తీసుకొని యల్లమంద చేతికి రాయబోతుంది]



యల్ల : (అరచేయి జూవుతూ) వద్దులే అమ్మ వద్దులే! ఇట్ట బొయ్యి నేను రాసుకుంటలే.

వీరా : పర్వాలేదులే, రాయనియ్ యల్లమందా, కాస్త మెత్త బడుతుంది.

(సీతమ్మ రాస్తూ ఉంటుంది.)

యల్ల : బంగారుతల్లి నూరేండ్లు బతుకమ్మా.

[రామిరెడ్డి, సుభాన్ ప్రవేశం]

దాదా : ఏంరా సుభాన్! రోజూ నాకంటె ముందే వచ్చే వాళ్ళుగా. ఇవ్వాళ ఇంత ఎనకమాల వచ్చారేం?

సుభాన్ : ఏముంది? రామిరెడ్డి గిత్త ఎటోపోతే దానికోసం తిరుగుతున్నాం.

వీరా : ఏది. ఆ ఎల్లగిత్తా?

రామి : అదే

దాదా : ఎటుబోయింది? ఏమన్నా జాడ తెలిసిందా?

సుభాన్ : ఆఁ ఆఁ

వీరా . ఎక్కడుంది?

రామి : ఇంకా ఎక్కడుంటుంది, గడీలో.

దాదా : గడీలో! అక్కడకెట్టాబోయింది?

వీరా : ఎలాబోతుంది! తోలుకుపోతే పోయి ఉంటుంది?

రామి : చెరువుకి నీళ్లకిబోతే వాళ్లమందలో గలిపి తోలుకెళ్లారు.

యల్ల : ఆ ఎదవలకి అది అలివిగాకేం! ఆవులెంరినబడి అదే పోయి ఉంటది.

సుభాన్ : వాళ్లదొడ్డికి పోవడంతోనే దివాణపు ముద్దరేసి కొట్టంలో కట్టేసుకున్నారు.

సీత : ఎంతగోరకలి !

దాదా : (విచారంగా) ఏంగిత్త ! అయిదు వందలంటే ఇయ్యాళ దాన్ని కళ్లుమూసుకొని తోలుకెళతారు.

రామి : అయిదువందలాయె. పదివందలాయె; ముందుకాడికింద పడిందిగదా ! ఎట్టజావాలంట !

వీరా : సరే ఇవ్వాళ మీటింగులో దీన్ని గురించికూడా గట్టిగా ఆలోచిద్దాం. ఇలా తోలుకెళ్లిన గిత్తలు మొత్తం ఎన్ని ఉన్నాయో ఇంటింటికీ తిరిగి లెక్క తీద్దాం. కొత్త నీళ్లతోపాటు పాతనీళ్లుకూడా కొట్టుకు రావాలి. అందాకా నాదగ్గిర మిగులెద్దుందిగా. దాన్ని అడ్డం బెట్టి పనిగడుపు.

రామి : పని గడుపుకోడానికేంగాని. దెబ్బ తగిలిననాడు కూడా నాకింత కష్టమనిపించలేదు బావా. నాగిత్తల రెంటిని బండికడితే కన్నుమూసి కన్ను తెరిచేటప్పటికి పోయి పేటలో వాలేయి. మరీ దాని దుంపదెగ అది వంటిమీద చేయి వేయనిచ్చేదా ? రేసు ! ఇవ్వాళ కంచంకాడ గూచుంటే నోట్లోకి ముద్దబోలేదే.

దాదా : నిజమే అనుకో నాయనా, కన్న బిడ్డకంటె ఎనిమిక్కిలిగా చూసుకున్నే గిత్త బోయిందంటే ఎవళ్లకయినా అట్టాగే ఉంటది.

సుభాన్ : వాడి రోజులు దగ్గిరబడే, ఇయ్యాళ దీన్ని తోలు కెళ్లాడు.

సీత : పాపిష్టి ముండాకొడుకు ఇంకెన్ని జేస్తాడో !



కమల : చేయాలసిన పనులన్నీ, ఇదివరకే చేశాడు.

వీరా : అవును; నిరుడుమట్టుకు నిరుడేం జేశాడు ! మన సుబ్బయ్యన్నగారి బీట్లో వాడి మందనుదోలి అదేమిటంటే ఇది నా బీడే అనలా !

యల్ల : నిజమే, ఆడిమందమీద మెకం బడ.

దాదా : ఏం బీడు ! బీడంటే బీడా ! వరాలబీడు. అట్టాంటి బీడు మన ఊరి మొత్తానికే లేదు.

సుభాన్ : అందాకా ఎందుకు ? చెరువులోతట్టు నాదే అని ఈయేడు దున్ని పైరు వేయలా ?

యల్ల : అదేందిబాబూ, సరకారి పోరంబోకలకుకూడా కంప గొట్టి ఆకట్టుకొన్నడుగా. నాగొఱ్ఱెపిల్ల మెసలడానిక్కూడా వీల్లేకుండా జేసిండు. ఆ సరకారేడజచ్చిందో!

వీరా : సర్కారే సరిఅయింది అయితే మనకీ తిప్పలే లేవు. అందుకనేమనంఅసలు ఈప్రభుత్వమేపోవాలంటున్నాం.

యల్ల : అబ్బో ! అట్టంటే మన సుబానయ్యకు కోపంరాదూ?

రామి : ఎందుకు ?

యల్ల : నబాబుగారిపెత్తనం పోడానికి సాయుబులొప్పుకోకేం!

సుభాన్ : అసలు ముందు ఈ దేశముఖు పెత్తనం పోడానికి యల్లమంద ఒప్పుకుంటేగా !

యల్ల : అదేందయ్యా సుబానయ్యా, నేను ఒప్పుకోకపోడమేంది ! ఆడుబోవాలిగాని అమ్మోరుకి యేటపోతు నియ్యనూ !

వీరా : (నవ్వి) దేశముఖు[illegible] యల్లమందా !

యల్ల : ఏందిబాబూ, నీవుకూడా అట్టంటావ్. మన్ని పీక్కుతినేవాడు ఎవడైతేం, పోవలిసిందే.

దాదా : మీ దేశముఖు మీ హిందువుల కెంతఒరిగిస్తన్నాడో మా నవాబు మా సాయిబులుకూ్కడా అంతే ఒరిగిస్తున్నాడులే.

రామి : వాడొరిగించి చచ్చేదిలేదు, వీడొరిగించి చచ్చేది లేదు; ఇద్దరూ గలిసి మన నెత్తురు తాగేవాళ్ళే.

సుభాన్ : అంతే, దొంగలు దొంగలు కలిసి ఊళ్లు పంచుకోవడమే.

యల్ల : ఎట్టయినా అసలు నబాబు మన దేశముఖంటోడు గాదంటలే! ఆయన సాలామంచోడంట!

కమల : అలాగే ఉంటుంది; దూరపు కొండలు నునుపు. ఈ జరిగే దుర్మార్గాలన్నీ ఆయనకి తెలియకుండానే జరుగుతున్నాయా? ఆకునూరులో ఏం జరిగింది: మాచిరెడ్డిపల్లిలో ఏంజరిగింది?

యల్ల : ఓఁ అమ్మాయికి సాలా పెద్దపెద్ద సంగతులు తెలుసునే.

సీత : తెలియడ మేమిటి? వాటిమీద ఒకపాటకూడా పాడతంది.

యల్ల : ఏందీ! పాట, పాడమ్మా పాడు.

కమల : పాటా లేదేమీ లేదు. వట్టిదే లేయల్లమందా. (అంటూ సిగ్గుతో కొంచెం తలవంచుకుంటుంది.)

దాదా : మాసీతమ్మ నోటినుంచి అబద్ధంరాకేం! పాడమ్మా పాడు.

వీరా : ఊఁ పాడు. ఇక ఎలాగైనా నీకుతప్పదులే.



కమల : ఒక్కదాన్నే పాడితే ఏం బాగుంటుంది?

సీత : అయితే ఇంకేం. ఎవరొద్దన్నారు? అన్నా చెల్లెలూ కలిసే పాడండి.

(వీరారెడ్డి కమల కలిసి పాడుతూ ఉంటారు)

నరకకూప మీ క్రూర నిరంకుశ
నైజాంపాలన రైతా॥
కరకర పేదల గొంతులుకోసే
కసాయి పాలన రైతా॥
మాన రక్షణకు ప్రాణమిచ్చు మన
మహిళా మణులకు రైతా॥
మానభంగమా! చిత్రహింసలా!
మన కట్టెదుటనె రైతా॥
నలుబది మందిని ఆకునూర నా
నడిబజారులో రైతా॥
ఖలు లీ నైజాం పోలీస్ మృగములు
కట్టి చెరచిరో రైతా॥
ఏకవస్త్రలని గర్భిణి స్త్రీలని
ఎంచరైరిగా రైతా॥
లోకములో ఈ హింసలు రాక్షసి
మూకలు చేసెన! రైతా॥
కైదునబెట్టీ వలువలు విప్పి
కారము గొట్టిరి రైతా॥
కళలకు సిరులకు నిలయమైన
ఈ తెలంగాణనో రైతా॥

మలమల మాడ్చుచు వల్లకాడుగా
మార్చె ప్రభుత్వము రైతా॥
లేదింతకు మించిన యమలోకము
లేదులేదురా రైతా॥
ఎందుకురా నికృష్టజీవితం
బెందుకురా ఓ రైతా॥
అందరుకలిసి ఎదిరించాలిదె
ముందుకు రారా రైతా॥

దాదా : (విచారంగా వీరారెడ్డితో) ఏంబాబూ, ఇదంతా నిజమేనా !

రామి : నిజమేనా ఏమిటి ? ఇదంతా నా కండ్లారా చూస్తేను. ఏం వీరారెడ్డి బావా ! ఏదో ఉత్తరం ఇచ్చిరమ్మని ఆయాళ నీవు నన్ను ఆకునూరు బంపలా ? అప్పుడామె ఎవరోవచ్చి...ఆఁ...ఏమిటీ ఆమెపేరు......

కమల : ఎవరు, పద్మజానాయుడా ?

రామి : ఆఁ ఆఁ ఆమెగారే. ఒక్కొక్కళ్లు ఆమెగారి దగ్గిర కొచ్చి తమ చెరలు చెప్పుకుంటుంటే నా కడుపు తరుక్కుపోయిందనుకో.

దాదా : (వీరారెడ్డితో) ఎవరు బాబూ ఆ మాతల్లి.

సుభాన్ : సరోజినీదేవి కూతురు.

సీత : ఆమె దేవూరు ?

వీరా : మన హైదరాబాదే. సరోజినీదేవి అంటే సామాన్యురాలుగాదు. కాంగ్రెసులో గొప్పనాయకురాలు.

యల్ల : కాంగిరేసేంది బాబూ ?



వీరా : ఇక్కడ మన ఆంధ్రమహాసభలాగే దేశంలో అదొక పెద్దసంఘం. ఎప్పుడన్నా గాంధీగారి పేరు విన్నావూ ?

యల్ల : గ్యాందీగారా ? గ్యాందీగారిపేరు ఇనక పోడమేంది. ఆయనేగా (అంటూ గోడకు తగిలించి ఉన్న గాంధీ ఫోటోవైపు చూపిస్తాడు)

సుభాన్ : ఊఁ ఆయనే. ఆ సంఘానికి నాయకుడాయనగారే.

దాదా : ఇట్టాంటి పెద్దలుండగానే ఇంతంత ఘోరాలు చేస్తున్నారు !

వీరా : ఎందుకు జేయరు. పటేల్లాంటి వాళ్ళుకూడా ఈరాజులతో, నవాబులతో రాజీబేరాలాడుతూవుంటే ?

యల్ల : ఏందీ పటేలా ? ఏ పటేలు ?

కమల : సర్దార్ పటేల్

యల్ల : ఓసోసి! అయితే ఆయన ఈపటేళ్ళందరి తల దన్నినోడన్నమాట !

సుభాన్ : అదిగాదు యల్లమందా, ఆయన మన పటేళ్ళాంటి వాడుగాదు; పెద్ద కాంగ్రెసునాయకుడు.

యల్ల : ఎంత కాంగిరేసు అయితే మట్టుకి ఈపటేళ్ళ నెట్టా నమ్ముతావయ్యా ? మీరు లచ్చజెప్పండి. నేను మట్టుకి పటేల్నెవణ్ణీనమ్మను.

వీరా : (నవ్వుతూ) సరే ఇప్పుడునీకు తెలియదులే ఈగొడవ. పోనీ, దీన్నిగురించి రేపు తీరికగా చెప్పుతానులే.

[తంగలిరాముడు ప్రవేశం]

వీరా : ఏమిటి రాముడూ ఇలావచ్చావ్.

రామి : ఏం. దొర పంపించాడా మమ్ముల్ని తీసుకరమ్మని.

రాముడు : లేదుబాబూ !

కమల : (నవ్వుతూ) మీకోసం గాదులే. మళ్ళీ యల్లమందను తీసుకరమ్మని పంపించివుంటాడు.

యల్ల : ఆఁ, నాకోసమే. ఇంకా నేను గడీకెల్లలేకేం! (రాముడితో) ఏమైనాసరే నేనురాను పోఅళ, చెప్పుకో పొయ్యి.

(అందరూ నవ్వుతూ ఉంటారు)

వీరా : అసలు విషయమేమిటో చెప్పనియ్. ఎందుకప్పుడే తొందరపడడం?

దాదా : (రాముణ్ణిజూచి) ఏమిటి పని?

(చెప్పడానికి రాముడు సందేహిస్తూ ఉంటాడు)

వీరా : సందేహిస్తావెందుకు? చెప్పు.

రాముడు : ఏంలేదుబాబూ, నేనుకూడా...(అందరిమొఖాల వైపుచూస్తూఉంటాడు.)

వీరా : చెప్పు, పర్వాలేదులే చెప్పు.

రాముడు : నేనుకూడా సంగంపడదామనుకున్న దొరా!

దాదా : ఈమాట చెప్పడానికే యింతభయ పడతావేం?

రాముడు : ఈసంగతి మల్లాదొరకు తెలిస్తే నిలువునా పాణం దీస్తాడు.

రామి : నీవు మా సంఘంలో ఎట్లాజేర్తావ్?

వీరా : అదేమిటి రామిరెడ్డీ, ఎందుకు జేరగూడదు? అతను మాత్రం మనలాంటి బీదోడుగాదా?

సీత : అయితేం. దేశముఖు మనిషిగా!

వీరా : అలా అనుకుంటే మనమంతా ఎవరం? దేశముఖ్ మనుషులంగాదా? అతను దేశముఖ్ ఇంటో చాకిరి



జేస్తున్నాడు. మనం బైటపొలంమీద పండించి వాడింటోబోస్తున్నాం అంతే తేడా.

దాదా : బాగా పారజూస్తే అంతేలే, ఏముంది తేడా?

యల్ల : ఈ మంగలాయన జేరతానంటేమట్టుకు దొర ఊరుకో వద్దూ.

సుభా : ఏమయ్యా రాములూ. బాగాఆలోచించుకున్నావా? ముందు చాలా చిక్కులొస్తాయ్.

సీత : ఇంకా ఆలోచించుకునే దేముంది! ఈసంగతి దొరకి తెలిస్తే నీశాస్తి నౌకరీ ఊడిపోతుంది.

రాముడు : పోతేపోయిందిలే అమ్మా. నా పీడా వదులుద్ది. ఈనౌకరీ ఉండి మట్టుకు నాకొరిగించే దేముంది? పొద్దస్తమానం ఆయనింట్లో అరవశాకిరీ సేయడమేగా?

కమల : ఏం: మీ మంగళ్ళకేదో కొంతమాన్య ముండాలిగా?

రాముడు : (విచారంగా) అదేవుంటే లేందేమిటమ్మా. ఎట్లో ఒకట్లా బతికేవాళ్ళం.

దాదా : ఆ మాన్యంకాస్తీ అప్పుడే లాక్కున్నాడుగా!

రాముడు : అయిదేళ్ళకింద ఎన్నడో నాపెళ్ళికి పాతిక రూపాయలిచ్చిండు. వడ్డీతో వంద దాటిందని, నిరుడు ఆకాస్తి గడ్డా లాక్కున్నడు.

వీరా : ఇందులో ఆశ్చర్యమేముంది? ఇది మామూలుగా జరిగేదేగా?

దాదా : ఈ ఊళ్ళో పనిపాటలోళ్ళ మాన్యాలెవళ్ళయ్ మిగిలాయి?

యల్ల : మాన్నేలేనా? బంచరాయికూడా నాదే అని లాక్కున్నడుగా?

వీరా : తాతలనాటినుంచి కాపురముండే కొంపల్లోనుంచి లేవగొడితే దిక్కులేదుగాని, ఇవి ఒకలెక్కా ? వాములుదినే స్వాములకి పచ్చిగడ్డి ప్రసాదం ! ఇలాంటి వెన్ని లాక్కోండే వాడికి ఇరవై వేల ఎకరం అయింది ?

సీత : సరే, పాపం ముందా రాముణ్ణి సంగంలో జేర్చుకోండి.

వీరా : ఏం దాదా, చేర్చుకుందామా ?

దాదా : నీ ఇష్టం నాయనా, ఆ మంచీ చెడ్డా అంతా నీకే తెలుసు.

రామి : ఏం, రాముడూ ! సంగంలో జేర్చుకుంటే ఇక దివాణంలోకి పోకుండా ఉంటావా ?

వీరా : ఏం పోతే ?

రామి : ఏం పోతేనా ! రెండావుల దూడలాగా అక్కడా ఇక్కడా ఎట్టకుదురుద్ది ? ఉంటే సంఘంలోనన్నా ఉండాలి; లేకపోతే దివాణంలోనన్నా ఉండాలి.

రాముడు : ఇదంతా ఎందుకు బాబు, అసలుమీరు పొమ్మన్నా నేనాడకుబోను.

సుభాన్ : ఏం ? ఎందుకని ?

రాముడు : ఏంజెప్పను బాబు నాగోడు! కొడుకు బుట్టి ఏడాది అయింది. ఇంతవరకు వాణ్ణి ఎత్తుకోని ఎరగను.

సీత : అదేంటి రాముడూ అట్టంటావ్ ?

రాముడు : ఏముంది తల్లీ కోడిగూసినప్పుడనగా లేసి సద్దిదాగి, గడీకిబోతా. ఆ పోయిన పోవటం మళ్ళీ నడిజాముకి గాని కొంపకు చేరను. ఇంకావాణ్ణి నేనెత్తుకునే దెప్పుడమ్మా ?



సీత ; నిజమేపాపం. నీవెళ్ళేటప్పటికి లేవడు. మళ్ళీనీవు తిరిగి వచ్చేటప్పటికి నిద్రబోతా ఉంటాడు. అంతేనా ?

రాముడు : అంతేనమ్మా, అంతే.

కమల : నడిజాందాకా అక్కడేం జేస్తావ్ రాముడూ ?

రాముడు : ఒకపనా ? ఎల్లిన కాడనుంచి బారెడు పొద్దెక్కేదాకా పక్కలు తీయడం, మంచాలెత్తడం. ఆ లంకంత కొంప ఊడ్చి ఎత్తిపోయడం సరిపోద్ది. పగలు పొద్దాకా ఆయన సేవజేయాలిగా ? మల్లీ సందకసువూడవడం. కందిల్లు (లాంతర్లు) తుడవడం. మల్లీ పక్కలేసి ఆయన నిద్దరోయిందాకా కాళ్ళు బిసికి-అప్పుడు బైటబడాలి. ఇంతజేసినా ఏరోజుకారోజు చీవాట్లూ చెప్పుదెబ్బలూ తప్పవ్.

యల్ల : ఓస్పోసి. ఆ టేజూత్తే నీకంటె నేనే కాత్తి మెరుగన్నమాట !

రాముడు : నీకేమయ్యా మారాజువి. ఎల్లిననాడు గొర్రెల కాడికెల్తావ్. లేనినాడు ఆయిగా గొంగలిముసుగెట్టి పండుతవ్.

యల్ల : టుర్ర్, కీ......

రామి : అదేంటి నీబొంద ?

యల్ల : లేకపోతే ఏంది ? నేను మారాజునంట, మారాజుని ! ఒకనాపు జీవాలెమ్మటెల్లమను, తెలుత్తుంది మంగలాయన సంగతి.

(అంతా నవ్వుతారు)

సుభాన్ : బీదోళ్ళకి కష్టాలకేం తక్కువలే. కాస్తే కూస్తే తేడాకేంగాని అందరిపనీ అలాగేవుంది.

వీరా : అవును. అందుకోసమే మనమందరంగలసి సంఘం బెట్టుకుంది. మనసంఘం ఎంత త్వరగా బలపడితే అంత త్వరగా మనమీకష్టాలనుంచి గట్టెక్కుతాం. సరే, రాముడూ ఇప్పుడు మేం మీటింగుకు పోతున్నాం. గాని, రేపుప్రొద్దున్నే రా సంఘంలో చేరుదుగాని.

రాముడు : సిత్తందొరా, మీబానిచోణ్ణి.

వీరా : అలాఅనగూడదు. మనసంఘంలో దొరలూ – బానిసలూ అంటూ ఉండరు. అందరం సమానమే. అంతా అన్నదమ్ముల్లాగ వుండాలి.

రాముడు : సిత్తందొరా. (నాలిక కొరుక్కొని) సిత్తంబాబూ, వత్తానండీ.

(దణ్ణంబెట్టి వెళ్ళబోతూవుంటాడు.)

వీరా : ఇదిగో రాముడూ, దివాణప్పనికి వెళుతూనే వుండు. ఎందుకయినా మంచిది.

రాముడు : అట్నేలేబాబూ (నాలుగడుగులేసి వెనక్కితిరిగి మళ్ళీ వీరారెడ్డిదగ్గరకొచ్చి) ఈ సందట్లో అసలు మాట మర్సిపొయ్యా. ఇయ్యాల దొరగారూ పట్వారీ కలసి కచ్చడపుబండ్లుకట్టుకొని నల్లగొండబోయిన్రండీ. ఆడనుంచి దొర పట్నంకూడా పోతడంట.

(అందరూ ఆలోచిస్తూ ఉంటారు.)

దాదా : ఎందుకెళ్ళినట్టబ్బా ?

రాముడు : రాత్రి చానా పొద్దోయిందాకా ఇద్దరేందో గుసగుసలాడిన్రు.

సుభాన్ : ఏమన్నా దొంగకేసులు పెడతాడేమో మనమీద.



వీరా : (ఆలోచిస్తూ ) సరే రాముడూ నీవుపద. మరేం పర్వాలేదు.

(రాముడు దణ్ణంబెట్టి వెళ్లిపోతాడు)

రామి : (రాముడు పోయిందాకా అతనివైపుచూస్తూ)ఏమో, వీణ్ణిక్కడికి జేగనివ్వడం నాకనుమానంగానే ఉంది.

వీరా : ఏమిటి అనుమానం ? అతన్ని సంఘంలో జేర్చుకోవడం తప్పనా నీ ఉద్దేశం ? అలాంటి బీదోళ్ళని జేర్చుకోకపోతే ఇంకెవర్ని జేర్చుకుంటావ్. నీకంటె, నాకంటె, అతనికేం తక్కువ కష్టాల్లేవు.

రామి : ఎన్నిజెప్పినా అతను దివాణప్పురుగు, ఇక్కడ సంగతులన్నీమూటగట్టుకెళ్లి అక్కడజెప్పితే...

సుభాన్ : ఏంచెప్తే. మనకేం భయం ? మనమేమన్నా దొంగేడ్పు ఏడుస్తున్నామా ? చేయదల్చుకున్న దేదో బండపగలగొట్టినట్లు మనం బజార్లోనే చెప్పిచేస్తన్నాం.

దాదా : అట్టాంటి బీదోణ్ణికూడా అనుమానిస్తే మన సంఘం ఎట్టా బలపడతది రామిరెడ్డీ. కాకపోతే నాలుగు రోజులు కాస్త కనిపెట్టి ఉందాం.

సీత : ఎంత దివాణంలోవున్నా, మొదటనుంచీ రాముడు కాస్త మెత్తని ముండాకొడుకే, అంత మోసం చేస్తాడనుకోను.

కమల : చేస్తె ఒకరోజు చేస్తాడు, రెండురోజులు చేస్తాడు. తర్వాత ఎక్కడికి బోతాడు ?

యల్ల : ఏడకి బోతడు. అంతేలే బుల్లెమ్మా. మేక అయిందీ

మొకం అయిందీ నాలుగడుగు లేసేటప్పటికి అదే తేలుద్ది. పదండి పోదాం.

వీరా : సరే. పదండి పోదాం మీటింగుకి. బోలో ఆంధ్ర మహాసభకీ జై !

లేవండోయ్ లేవండోయ్
కార్మిక కర్షక యోధుల్లారా ॥రారండోయ్॥
దారుణ హింసాకాండను ఢీకొని
పోరాడాలిదె రణరంగానికి ॥రారండోయ్॥
పేదలరక్తము పీల్చు దేశముఖు
పిశాచిపాలన నశింపజేయగ ॥రారండోయ్॥
స్త్రీలను జెరచి శిశువులజంపే
కాలకింకరుల కాలరాయగా ॥రారండోయ్॥
ప్రజలకు హక్కులు లేనిప్రభుత్వం
ప్రభుత్వమా అది పశుప్రభుత్వం
స్వాతంత్ర్యము మన జన్మహక్కని
జయభేరిని మ్రోగించ పదండోయ్ ॥రారండోయ్॥

[తెర]



# IV

## దివాణం (గడి)

[దేశముఖు, అతనివెనుక పట్వారీ, ప్రవేశం]

జగ : చూశావయ్యా చూడు. పదిరోజుల్లో ఒక్కొక్కణ్ణి చీల్చి ఎండేస్తానో లేదో! పూటకూటికి గతిలేని ఈ వెధవలు నన్నా ఎదిరించేది?

వెంక : (నవ్వి) అంతేలెండి. గొర్రెకొవ్వి కొండమీద తిరగబడిందట! అలావుంది! వీళ్ళపని.

జగ : హ్హూం. ఏమిటనుకున్నారో, దేశముఖు జగన్నాధరెడ్డి అంటే.

వెంక : మీసంగతి ఆ కూపస్థమండూకాలకేం తెలుసు! ఆవులించితే పేవులులెక్కబెట్టరూ! మీరు పట్నం బయలుదేరగానే అనుకున్నా "ధొరవారికి కోపం వచ్చింది, ఇక ఈదెబ్బతో ఈగాడిదలంతా నల్లుల్లాగా మాడిపోవలసిందే" అని.

జగ : అనుకోవడమేమిటయ్యా, ఇంకా మనకత్తికెదురుకత్తి వుందా ?

వెంక : ఎలాగయినా... మనప్రభువు......

జగ : ప్రభువు! (వికటంగానవ్వి) మనం లేకపోతే ప్రభువెక్కడుంటాడయ్యా, సాయిబైతేమాత్రం సర్ మీర్జా ఇస్మాయిల్ని చెప్పుకోవాలిగాని.

వెంక : అబ్బో ఆయనెక్కడ! యుగంధరుడు కాకపోతే ఏమిటి మరి? ఎక్కడ వేయవలసిన పాచిక అక్కడే వేస్తున్నాడు. అటు వైస్రాయి దగ్గరకెళ్ళి నీఅంతమొనగాడు లేడనిపించుకున్నాడు. ఇటు కాంగ్రెసు వాళ్ళ దగ్గిరకెళ్ళి కాంగ్రెసోడు అనిపించుకుంటున్నాడు.

వెంక : అనిపించుకోడమేమిటి? పత్రికలుకూడా ఆయన్ని కాంగ్రెసే అని రాస్తుంటే!

జగ : ఒహో, అలాగా! ఇంకా నాకాసంగతి తెలియదే, ఏమి ప్రజ్ఞయ్యా. అలాయింకెన్ని పత్రికలనోళ్ళు గట్టాడో!

వెంక : అసలు ఆయనకి వ్యతిరేకంగా నోరు తెరచిన పత్రిక ఒక్కటుందా?

జగ : పత్రికలమాట సరేనా, ఇలాంటి వెధవలందర్నీ కేసులు పెట్టి శిక్షించమని హైకోర్టు, కిందకోర్టులకు ఒక రహస్య సర్క్యులరు కూడా పంపింది. ప్రపంచంలో ఏ మంత్రి చేయించగలిగాడయ్యా ఇంతగొప్పపని!

వెంక : నిజమే మంచిప్లానే వేశాడు. కాని ఏలాభం; అదేదో పత్రిక ఆ రహస్యంకాస్తా బైటపెట్టిందిగా!

జగ : ఏడ్చింది! మంత్రాలకు చింతకాయలు రాలకేం? జరిగే పనేదో జరుగుతూనేవుంది. అటు ట్రైనింగు తీసుకునే వాళ్ళు తీసుకుంటూనేవున్నారు. ఇటు ఊళ్ళమీద దాడిచేసేవాళ్ళు చేస్తూనే ఉన్నారు. హైదరాబాద్‌లో చివరకి నిజాం సాగర్‌లోకూడా విమానాశ్రయం నిర్మిస్తున్నారు.

వెంక : (ఆశ్చర్యంగా) నిజాం సాగర్‌లోనా! చెరువులోనా విమానాశ్రయం!



జగ : ఆఁ, చెరువులో విమానాశ్రయం. ఇంగ్లండులో లేచిన విమానాలు ఏకాయెకీవచ్చి ఇక నిజాం సాగర్‌లో వాలడమే. ఏమనుకున్నావ్ మరి మిర్జాఇస్మాయిల్ దెబ్బంటే.

వెంక : నిజమే. మంచి ఘటికుడే, కాని ఏం ప్రయోజనం? అతను రాజీనామా ఇచ్చి వెళ్ళిపోతాడటగా?

జగ : ఏం వెళ్ళిపోతే? అతను తాత ఇంకొకడు వస్తున్నాడు. తెలుసా?

వెంక : (ఆలోచిస్తూ) ఎవరబ్బా!

జగ : ఎవరేమిటి? మన పాతచుట్టమే. చత్తారీనవాబు!

వెంక : అయితే ఇంకేం? "అతనికంటె ఘనుడు ఆచంట మల్లన్న", మనికింకా స్వేచ్ఛ. సరేగాని, ఈమధ్య ఆకిన్‌లెక్ కూడా మన హైదరాబాద్ వచ్చాడటగా

జగ : వచ్చాడు; వేయాలిసినప్లానేదో వేశాడు. ఇక మనకేం లెక్క; కానివ్వవయ్యా, మన తరఫున లక్ష నైజాం సైన్యంఉంది. ఇంకా కావలసివస్తె అంగ్రేజ్ సర్కారు విమానాలు, టాంకులు కూడా పంపిస్తుంది. ఇక వీళ్ళు. వీళ్ళ సంఘాలు ఈ దెబ్బతో మసిమసి.

వెంక : అసలు అంగ్రేజ్ (బ్రిటిష్)లో ఉన్న సంఘాలుకూడా పోతేగాని మనకీ పీడ పూర్తిగా వదలదు.

జగ : ఇంకా సంఘాలేమిటి? తెలుగు దేశమంతా అసలు మన నవాబుగారి చేతుల్లోకే వస్తూఉంటే.

రాముడు : (ప్రవేశించి సలాంజేసి) దొరవారితో మాట్లాడాలని ఎవరో వచ్చిన్రండీ.

వెంక : ఎవర్రా?

రాము : ఎవరోనండీ, నల్లగొండనుండి వచ్చిన్రు. వకీలుసాబు గారంట.

వెంక : ఒహో! శ్రీనివాసరావుగారా! సరే రమ్మను.

రాము : సిత్తం (సలాంజేసి వెళ్ళిపోతాడు.)

జగ : ఎవరయ్యా ఆయన.

వెంక : వకీలండీ, చాలా మంచివాడు, కాంగ్రెసులోకూడా ఆయనకు చాలా పెద్ద పేరుంది; మొన్న నల్లగొండ వెళ్ళినప్పుడు నాతో కలసి మాట్లాడారు. ఇవ్వాళ మీ దర్శనానికి వస్తాననికూడా చెప్పారు. ఈగొడవలో బడి నేను మీతో ఆ మాట చెప్పడమే మరచి పొయ్యా.

జగ : ఒహో! ఆయనా? అయితే ఆయనకి మనతో ఏం పని?

వెంక : (చిరునవ్వు నవ్వుతూ) కాలం మారిపోతూ ఉంది కాదండీ. మనంకూడా అలాంటివారితో సంబంధాలు పెట్టుకోడం ఎందుకైనా మంచిది. అందుకని నేనే వారిని మన దివాణానికి ఒకసారి రమ్మన్నాను. ఎలాగయినా వారూ గొప్పవారు. మంచీ చెడూ తెలిసిన పెద్దలు. ఏ కాంగ్రెసులో పనిచేసినా అలాంటివారికి చెల్లుబడి అవుతుంది.

[శ్రీనివాసరావు ప్రవేశం – గాంధీటోపీ, లాల్చి, బిళ్ళగోచి, చేతికి గడియారం, కండ్లజోడు, కాళ్ళకు చెప్పులు, ఒక చేతిలో వంక కర్ర, మరో చేతిలో 'హిందూ' పత్రిక జేబులో ఫౌంటెన్ పెన్, ఖద్దరు శాలువా కప్పుకొని]

వెంక : (లేచి) నమస్కారమండీ శ్రీనివాసరావుగారూ!



శ్రీని : నమస్తే

జగ : దయచేయండి (అంటూ పక్కన కుర్చీ చూపెడతాడు)

వెంక : ఎక్కడనుంచీ? నల్లగొండనుంచేనా రావడం.

శ్రీని : ఆ, నల్లగొండనుంచే. రాత్రి సూర్యాపేట వచ్చి ఉదయమే అక్కడనుంచి బయలుదేరి సరాసరి వస్తున్నా.

జగ : ఏమిటండీ విశేషాలు శ్రీనివాసరావుగారూ?

శ్రీని : ఏమున్నాయి? మన నవాబుదే పెద్ద గొడవగా ఉంది.

వెంక : ఏమిటది?

శ్రీని : రేపు ఆగస్టు 15 తో ఇంగ్లీషువాళ్ళు ఇండియాకు స్వరాజ్య మిచ్చేస్తున్నారు. సంస్థానాలన్నీ యూనియన్ లో చేరుతున్నాయి. కాని మన నవాబుమాత్రం చేరడట!

వెంక : చేరక ఏం జేస్తాడు?

శ్రీని : స్వతంత్రంగా ఉంటాడట!

జగ : అతనెలా ఉంటే మనకేం లెండి.

శ్రీని : అదేమిటండీ అలా అంటారు. స్వతంత్ర భారత దేశం నడిబొడ్డులో ఈ ఫాసిస్టు ప్రభుత్వముంటే దేశమంతా నాశనమైపోదండీ? అక్కడ ఏడవలేక పారిపోయి వచ్చే ఇంగ్లీషువాళ్ళందర్నీ ఇక్కడకు జేరదీస్తాడు. పాకిస్తానుతో కుట్రజేసి చివరకు ఇండియా ప్రభుత్వాన్నే కూలదోస్తాడు.

వెంక : మొత్తంమీద మన నవాబు పెద్ద ప్లానే వేశాడు. ఇదివరకే హిందువుల్ని ఉద్యోగాలనుంచి లాగేశాడా, ఇక రేపటినుంచీ జుట్టుపన్నుకూడా వేస్తాడు!

శ్రీని: ఏడ్చాడు! ఈరోజుల్లో అలాంటి పిచ్చికళలేమీ సాగవు. స్టేట్ కాంగ్రెస్ బ్రహ్మాండమైన పోరాటం తీసుకరాబోతూవుంది. మన చుట్టూ కాంగ్రెసు ప్రభుత్వాలున్నాయి. పైన ఢిల్లీలో నెహ్రూ ప్రభుత్వముంది. కావలసినంత సైన్యం ఈరోజు కాంగ్రెసు చేతిలోఉంది. ఈదెబ్బతో నైజాంప్రభుత్వం పునాదులు కదలిపోవాలి.

వెంక: భేష్! బాగా సెలవిచ్చారు.

శ్రీని: ఈ పోరాటానికి మీబోటివారుకూడా విరాళాలిచ్చి పూర్తిగా సహాయంచేస్తారని ఆశిస్తున్నాను.

జగ: (నవ్వుతూ) దానికేంవచ్చెలెండి. మీబోటివారు స్వయంగావచ్చి అడగడం, నేను కాదంటమూనా!
(జేబులోనుంచి నూరురూపాయల నోటుతీసి ఇస్తాడు)

శ్రీని: (తీసుకుంటూ) మీరు తప్పకుండా సహాయంచేస్తారనే ధైర్యంతోనే యిందాకా వచ్చాను. అచ్ఛా! వస్తాను. నమస్తే!

(శ్రీనివాసరావుతోపాటు దేశముఖ్ పట్వారీలుకూడా లేచినుంచుంటారు)

వెంక: మాధొరవారికి మొదటినుంచీ కాంగ్రెసంటే చాలా అభిమానంలెండి. ఏదోకాలానికి కట్టుబడి ఇలా ఉండవలసివచ్చింది. 'ఓ' అంటే 'నా' రానికుంకలంతా ఈ ఊళ్ళో సంఘమంటూ ఒకటిబెట్టి నానా హంగామా చేస్తున్నారండి.

**(మస్తాన్ ప్రవేశించి సలాంజేసి ఒకప్రక్కన ఒదిగి నుంచుంటాడు. అతని ముఖంలో విచారభావం వ్యక్తమౌతూఉంటుంది.)**



వెంక: ఏం మస్తాన్ అలా ఉన్నావ్;

మస్తాన్: ఏం చెప్పను. పొద్దుటినుంచీ ఊరుచుట్టూ, గూడెంచుట్టూ తిరిగి తిరిగి నాదుంప తెగింది.

వెంక: ఏం?

మస్తాన్: ఏముంది? ఇయ్యాల జీతగాడెవడూ పనిలోకిరాల.

జగ: (బిగ్గరగా) ఏం? ఏం బుట్టింది?

వెంక: ఏముంది? సంఘంవాళ్ళు సమ్మె జేయించి ఉంటారు. చూశారా శ్రీనివాసరావుగారూ వీళ్ళపని? కడుపులో చల్లకదలకుండా హాయిగా బ్రతికే రైతుల్ని, కూలీల్ని ధొరవారి మీదికే ఎలా ఉసిగొల్పుతున్నారో?

శ్రీని: అసలిక్కడ సంఘానికెవరూ నాయకుడు?

వెంక: ఉన్నాడులెండి యీఊళ్ళో వీరారెడ్డి అనేఒకకుర్రాడు.

శ్రీని: ఎవరు? వీరారెడ్డా? అతనెప్పుడైనా ఇదివరకు జిల్లా ఆంధ్రమహాసభలో పనిచేశాడా?

జగ: ఆ, మొన్న మొన్నటిదాకా అక్కడే మిడికాడు.

శ్రీని: ఓ. అయితే ఇంకేం? అతన్ని నేనుబాగా ఎరుగుదును. వసుధా అతను చాలా మంచివాడేనే. కాకపోతే, ఇంకా కుర్రతనం కాబట్టి కాస్త తొందరపడిఉంటాడు.

వెంక: కుర్రవాడనే ఉద్దేశంతోనే ధొరవారు ఇంతవరకు ఓపిక బట్టారు. కాని ఆ మంచి ఏమీ దక్కనిచ్చేట్టు లేదు. ఊళ్లో అడుగు బెట్టినదగ్గిరనుంచీ అతనికి దేపని.

శ్రీని: అదే మాకూ వాళ్ళకూ వచ్చిన తేడా. మేం కొంచెం నిదానించమంటున్నాం. వాళ్ళు తొందరపడుతున్నారు.

అయినా మీరుకూడా కొంచెం కాలాన్నిబట్టి నడుచుకోవడం ఉభయులకూ శ్రేయస్కరం. నమస్తే.

(వెళ్ళిపోతూవుంటాడు)

వెంక : (శ్రీనివాసరావుతోపాటు నాలుగడుగులేసి) ఉంటానండీ శ్రీనివాసరావుగారూ! నమస్కారం.

శ్రీని : అచ్ఛా! ఉండండి; అరెస్టుకాకుండాఉంటే మళ్ళీ ఒకసారి వచ్చి కలుసుకుంటాను.

జగ :<br>వెంక : } అలాగే తప్పకుండా రాండి.<br>తమదయ.

(శ్రీనివాసరావు వెళ్ళిపోతాడు)

జగ : (కోపంగా అటూయిటూ తిరుగుతూ) మంచిఆటమంచి? ఆవెధవేమో పెద్ద బుద్ధిమంతుడట! మనమేమో కాలాన్నిబట్టి నడుచుకోవాలట? బయలుదేరాడు మహానాయకుడు; వందరూపాయలు గాజేసి పైన శ్రీరంగనీతులు జెప్పడానికి.

వెంక : (చేతులు నలుపుకొంటూ) వకీలంటే మొన్న మనింటికి వచ్చిన పెద్దమనిషిలాంటివాడే అనుకున్నా. నాకేం తెలుసు, ఈ మహానుభావుడు తిన్నయింటి వాసాలే లెక్కబెడతాడని. సరే, ముందు ఈజీతగాళ్ళ సంగతేమిటో తేల్చుకుందాం. మస్తాన్, ముందు సేత్ సింధీని (మోతాదు) బంపి, ఆగాడిదలందర్నీ పిల్చుకరమ్మను.

జగ : ఊఁ వెళ్ళు. ఇవ్వాళ ఒక్కొక్కణ్ణి డొక్కజీల్చేస్తాను.

మస్తాన్ : ఇంకాసేత్ సింధీ ఎక్కడబాబూ, వాడందరికంటె ముందే ఎగగొట్టాడు!



వెంక : అయితే ఊరు, గూడెం ఏకమయిందన్నమాట.

మస్తాన్ : ఎక్కడగొడ్లు అక్కడే ఉన్నాయి, చివరకి వాటి దగ్గిర పేడతీసే దిక్కు కూడా లేదు.

వెంక : (దేశముఖు వైపుచూచి) ఎంతపని చేశారు గాడిదలు, మన యిద్దర్నీ ఊళ్ళోలేకుండా జూసి!

మస్తాన్ : మీ ఇద్దరూ ఊళ్ళో లేకపోవడంవల్లనే వాళ్ళకింత కొమ్ములొచ్చాయి, రాములవారి గుడిదగ్గర పెద్ద మీటింగుకూడా జేశారు.

జగ : మీటింగే! నావూళ్ళో! నా రామ మందిరంముందు? మరి నీవెక్కడేడ్చావ్!

మస్తాన్ : ఏంజేస్తాను ఊరూ నాడూ ఏకమైతే? వాళ్ళముందిప్పుడు నాబోటోడు మాట్లాడేటట్టుందా! ఆయనెవరో, ఒకాయన వచ్చాడు, జిల్లా నాయకుడంట-జిల్లానాయకుడు. తెగవదిరాడు. అప్పటికీ కోపం బట్టలేక మనముఠాచేత మీటింగుమీద రాళ్ళుకూడా వేయించా.

వెంక : భలేపని చేశావ్, కుక్కకాటుకి చెప్పుదెబ్బ, సరిపోయింది.

మస్తాన్ : సరిపోయేదే, కాని......

జగ : కాని—

మస్తాన్ : దొంగగాడిదకొడుకులు, కాపలాగాసి మనాళ్ళందర్నీ పట్టుక కొట్టారు.

వెంక : కొట్టడమే!

మస్తాన్ : కొట్టడమేమిటి? మరీ మన ఓనమాల వెంకన్నని చావచితక బాడిచారనుకోండి. మీటింగులో లేచి

నుంచొని అంతా ప్రమాణం కూడా చేశారు. దేశముఖు పెత్తనం నాశనం జేసిందాకా నిద్రబోరట!

జగ : ఏమిటి ప్రమాణాలవరకూ వచ్చిందీ? చూస్తాను. వాళ్ళనాశనమో నా నాశనమో తేలిపోవాలి.

(ఒకపోలీసు ప్రవేశించి సలాంజేసి నుంచుంటాడు)

వెంక : అమీన్ సాబ్ గారు వచ్చేశారా ఏమిటి ?

పోలీస్ : ఆఁ, వస్తున్నారు మారాజ్.

జగ : పోలీసో?

పోలీస్ : ఆఁ, పోలీసుకూడా వస్తాఉంది మారాజ్.

వెంక : వస్తున్నారా! అచ్ఛా.

జగ : ఎవడురా అక్కడ?

(రాముడు ప్రవేశించి దణ్ణంబెట్టి నుంచుంటాడు)

జగ : ఏంరా, బంగళాఅంతా ఊడ్చి బాగుజేశావా?

రాముడు : ఆఁ చేసిన్నదొరా.

జగ : (వెంకట్రావుతో) తయారుచెయ్యవయ్యా జాబితా, అరే రాముడూ, ఆజాబితా కోమటికిచ్చి కావలసిన వస్తువులన్నీ బంగళాకి పట్టుకెళ్ళు.

(పట్వారీ వెంకట్రావు జాబితా తయారుచేస్తూ ఉంటాడు)

జగ : ఏయ్ మస్తాన్, నీవెళ్ళి గేటుదగ్గరనుంచో, అమీన్ సాబ్ రాగానే నాకు కబురుజెయ్. (పోలీసుతో) రెండు ఏటలు సరిపోతయ్యా.

పోలీ : పలావ్‌కి మా అందరికీ రెండెట్లా సరిపోతయ్ జనాబ్, కనీసం నాల్గయినా ఉండాలి.

జగ : సరే, పంపిస్తాను?



వెంక : అరేయ్ రాముడూ. ఇదిగో జాబితా పట్టుకెళ్లు.

(కాగితం మడిచి రాముడికివ్వబోతాడు)

పోలీ : ఏమేం రాశారు పట్వారీసాబ్ ?

వెంక : మీకు కావాలిసినవి సమస్తం రాశాను; మసాళాదినుసులు, మిర్చి, చింతపండు, అల్లం. బెల్లం, ఉప్పు, పప్పు, ఉల్లిగడ్డలు. వెల్లిగడ్డలు, బీడీలు, సిగరెట్లు,— బియ్యం. నెయ్యి...

పోలీ : నెయ్యి ఎంతవేశారు ?

వెంక : అరడబ్బా.

పోలీ : అరడబ్బా ఎట్లాజాల్తుంది మారాజ్, ఒక్కడబ్బా అయినా లేకపోతే ఎట్లా ?

జగ : (వెంకట్రావుతో) ఊఁ నెయ్యవయ్యా, డబ్బా వెయ్. అరే రాముడూ, నీతోపాటు ఈ పోలీసుకూడా వస్తాడుగాని ఆయనికి కావలసినవన్నీ ఇప్పించేసెయ్.

రాముడు : సిత్తం దొరా (జాబితాతీసుకొని దణ్ణంబెట్టి వెళ్ళిపోతాడు)

పోలీసు : ఆదాబ్ అర్జ్.

(సలాంజేసి వెళ్ళిపోతాడు)

జగ : (అటూఇటూ పచార్లుగొడుతూ) నేటికి నాఊళ్లో పొరుగూరివాడు వచ్చి మీటింగు బెట్టడమా! సమయానికి నేను లేకపోతిని.

వెంక : మనమే ఉంటే ఊళ్ళోకాలుబెట్టి మళ్ళీవాడు బైటికి పోతాడా ? వంటింట్లో కొచ్చిన కుందేలు తప్పించుకపోయింది. ఇప్పు డేమనుకుంటే ఏం లాభం ?

జగ : చూస్తాను. ఈసారి ఎలాతప్పించుకపోతాడో !

వెంక : అసలీ జిల్లాకు చిచ్చుబెట్టిందే ఆ వెధవ. ఒకసారి గట్టిగా దరువు పడితే కాని...

జగ : దరువులేదు, గిరువులేదు. ఈసారి దొరికితే బిస్మిల్లా చేయడమే, ఎన్ని వేలయితే మాత్రమేం ?

వెంక : ఆ ముండమోపికి వేలుగావాలా ? మన వెంకన్ననీ, సుబ్బన్ననీ ఇంకా రెండువాపు లెక్క వేసుకోమంటే సరి! రేపీపాటికి...

[మస్తాన్, అమీనుల ప్రవేశం]

జగ : }
వెంక : } (లేచినుంచోని) ఆదాబ్ అర్జ్ హై.

అమీన్ : ఆదాబ్ అర్జ్ హై.

[దేశముఖు అమీన్ కెదురుగా వెళ్ళి, కరస్పర్శజేసి తీసుకొచ్చి తన కుర్చీలో కూచో బెడతాడు. పక్కనున్న కుర్చీలో తాను కూచుంటాడు. పట్వారీ ఒకపక్కన, మస్తాన్ మరోపక్కన నుంచుంటారు]

అమీన్ : (కూర్చీలో కూర్చుంటూ) హేమ్టి మహరాజ్; నీ మీందా షికాయత్ వచ్చిందీ, మీందీ దివాణంలో చాలాచాలా గొడ్వాహుందట !

జగ : నామీదనా షికాయత్ ! ఎవడా చేసింది ?

అమీన్ : హెవడూ హేమ్టి హిక్డీ జనంహంతా దస్తఖత్ చేసీ తాలూక్‌దార్కి హింతాపొడ్గూ మహజర్ హోక్టి పంపార్. రైతుల్ మీంద చాలాచాలా జులుం చేస్తున్నావూ హంట.

వెంక : సర్కారీ లెవీ ఇవ్వమని గట్టిగా అడగడంకూడా జులుమేనా ? లెవీ ఇవ్వకుండా ఎగ్గొట్టి పైన దేశముఖ్



గారి మీదనే రిపోర్టు చేశారన్నమాట ! ఏముంది ! మొగుణ్ణి గొట్టి మొర్రో అన్నట్లుంది, ఇదంతా.

అమీన్ : హరే లెవీ గివీ గొడ్వా మాకీహేమ్టి ? హాళ్ళా కొంపల్కి లూటీచేయడం, హెద్దులుకీ తోల్కపోవడం, హాళ్ళా పొలాల్కి మీందీ ఖబ్జా (వశం) చేసోకవడం, గడీకీ పిల్చికొట్టడం – హిదంతా జులుం గాకాపోతే హేమ్టిఅయ్యా.

వెంక : హుజూర్, ఇదంతా సంఘంవాళ్ళ మాయ. రంకు నేర్చిన అమ్మ బొంకకపోతే ఎట్లా ?

(మస్తాన్ను సారాసీసా తీసుకరమ్మని దేశముఖ్ సైగజేస్తాడు)

జగ : (పట్వారీతో) అదేమిటయ్యా, వెంకట్రావుగారూ, సంఘం వాళ్ళ బద్మాషీ మన అమీన్‌సాబ్ గారికి తెలియకుండా ఉందా?

వెంక : వారికి తెలియకపోవడ మేమిటి? అసలు నవాబుగారే పోవాలని వాళ్లు మీటింగులు పెడుతూ ఉంటే.

అమీన్ : మీటింగూ ! హెక్డా ?

వెంక : ఎక్కడేమిటి ! రాత్రి ఈ ఊళ్లోనే మీటింగుబెట్టారు.

అమీన్ : అరే మాందీ ఇజాజత్ (పర్మిషన్) లేకుండా హెట్టా బెట్టారూ ?

జగ : వాళ్ళపని ఇప్పుడు మీరూ మేమూ కనబడేటట్టుందా?

వెంక : కనబడేటట్టుంటే అమీన్‌సాబ్ గారంతటి వాణ్ణి బట్టుకొని నిన్న మీటింగులో అలా ఎందుకు తిడతారు?

అమీన్ : హేమ్టీ ? నాకీ తిట్టారా !

[మస్తాన్ సారాసీసా తీసుకొచ్చి టేబుల్ మీద ఉంచుతాడు]

జగ : (గ్లాసులో సారా పోస్తూ) ఒక్క తిట్టడమేనా ! మిమ్మల్ని మమ్మల్ని నాశనం జేసిందాకా వాళ్ళు నిద్రబోరట !

(గ్లాసు అమీన్ చేతికిస్తాడు.)

అమీన్ : (గ్లాసుతీసుకుంటూ) అరే బద్మాష్. (ఒక గుక్క తాగి) మీకీ పటేల్కీ ఉండీ ఎందుక్క జర్గనిచ్చావ్ మీటింగ్ ?

మస్తాన్ : ఏం జేస్తాం హుజూర్. మీటింగ్ ఆపమని దొర వారు పంపితే వెళ్లాం. చూడండి ఏం జరిగిందో (వీపు చూపెడతాడు)

అమీన్ : అరే బాప్ రే ! (గ్లాసు కిందబెడుతూ) హెవడూ ఆ సువ్వర్ నీకీ కొట్టింది.

వెంక : ఇంకెవరు గొడతారు! సంఘంవాళ్లే. ఎంత ఘోరమో చూడండి, ఆ దెబ్బలు చూడండి!

అమీన్ : హిక్డా హెంతజనం హుంది షంగంలో.

వెంక : మస్తాన్‌బోటి బుద్ధిమంతులు ఎవళ్లో పదిమంది దప్ప అంతా సంఘంలోనే చచ్చారనుకోండి.

అమీన్ : (సిగరెట్టు ముట్టిస్తూ) అరే ఊరికీ ఊర్ హంతా షంగంలో చేరిందీ ?

వెంక : రాడీముండాకొడుకులంతా జేరి చంపుతాం పొడుస్తాం అని బెదిరిస్తే జడిసి ఈ పిచ్చి మూకంతా జేరింది.

అమీన్ : హంతా జులుం చేశార్గా.

వెంక : నేను చెప్పడమెందుకు, చూడండి మీరే స్వయంగా చూడండి. (వస్త్రం విప్పుతూ) పాపం ఆ గొల్లముండా



కొడుకొచ్చి లబ్బున ఏడ్చాడు. (యల్లమంద కాగితం తీసి అమీన్ చేతికిస్తాడు.)

అమీన్ : (చదివి) అచ్ఛా! బులావో, హెల్మందాకో హిడ్షే దర్యాప్త్ చేయ్‌వాలి.

జగ : మస్తాన్ ఊఁ వెళ్లు యల్లమందను బిల్చుకరా.

వెంక : మీబోటివారు పూనుకోవాలిగాని. ఈకుక్క గొడుగు సంఘాలెంతసేపు (చిటికేస్తూ); ఇట్టంటే ఎగిరిపోవ్వా !

అమీన్ : హంతా తేల్కాకాదూ పట్వారీసాబ్ ! హిప్డూ హెక్డాజూసినా హిదేగొడ్వా. రోజూ రోజూ సచ్చి పోతండాం తిర్గాలేక.

జగ : ఇలాంటి వెధవల్ని పైకెక్కనిస్తే మీకూచిక్కే మాకూ చిక్కే, ఈ దెబ్బతో ఒక్కొక్కడికీ తలదిమ్మ వదిలించండి.

వెంక : మన అమీన్‌సాబ్ గారికిదాక లెక్కా ! పెద్ద పెద్ద కొమ్ములు దిరిగిన హేమా హెమీల్నే చితక గొట్టారు.

అమీన్ : హదీకాదయ్యా, హిదీ షంగంతో మాకీ పెద్దా పేచీ వచ్చిందీ. మాదీ పోలీస్‌మీదకూడా సదర్ నాజంకీ షికాయత్ (కంప్లెయింట్) చేస్తండార్. పేపర్‌నిండా మాకీ బద్‌నామ్ చేసి వేస్తండార్. హీళ్కీ జోల్కీ పోతే మాకీ కష్టం తెచ్చీ పెడ్తార్.

జగ : ఈ పీనుగులు మిమ్మల్ని చేయగలిగిందేమిటి ? గుడ్డి కన్ను మూస్తే ఎంత. తెరిస్తే ఎంత ? ఇదిగో మీ కట్నం మీరు తీసుకోండి. (జేబులోనుంచి నాలుగు

వేల రూపాయల నోట్లు తీసి ఇస్తూ) ఊఁ, కాని యిచ్చేండి మీ దెబ్బ కేదు రేమిటి?

అమీన్ : వద్దూ, మా రాజ్ వద్దూ. హిందీ మాకీ ప్రాణంమీదికి వస్తాది.

జగ : మీ ప్రాణంమీదకా! ఏడ్చారు. అందాకావస్తే ఇంకా మేం ఉండి ఎందుకు? నాలుగువేలు కాకపోతే పది వేలయితే మాత్రం ఈ సంఘాన్ని నాశనం చేయకుండా వదిలిపెడ్తానా?

వెంక : మా దొరవారు మాటంటే వెనక్కితిరిగే మనిషా? మన సర్కారే పోయాక ఇంకా మనం ఉండి ఎందుకు?

జగ : అమీన్‌సాబ్, అందాకావస్తే మీ ప్రాణానికి నా ప్రాణం, సందేహిస్తా రేమిటి? ఊఁ తీసుకోండి (మరో నాలుగు వేలు తీసి ఇస్తాడు)

అమీన్ : అచ్ఛా, అసల్ సర్కార్కీ పోయేటట్టుహుంటే మన్కీ హుండి హెందుక్కా! (పైకం తీసుకొని జేబులో వేసుకుంటూ, చూస్తాన్ హీళ్కీ తడాఖా. ఈహూళ్లో హెంతామంది ముసల్మాన్ లుండార్?

వెంక : ఎందుకు లేరు, వాళ్ళూ ఇరవైకుటుంబాల వాళ్ళున్నారు.

అమీన్ : హాళ్కీ మీకీ తరఫ్ హుండార్?

వెంక : లేదు సర్కార్. వాళ్ళుకూడా సంఘంలోనే చేరారు.

అమీన్ : అరే. హాళ్కీ బుద్ధీలేదూ? కాఫిర్ (మహ్మదీయేతర) షంగంలో హెట్టా చేరార్. మాదీ నవాబ్కీ వద్లీపెట్టి.



[మస్తాన్ ప్రవేశం]

వెంక : వాళ్ళందరికి పెద్ద ఈ మస్తాన్ తమ్ముడు సుభానేనండి.

అమీన్ : క్యారే. నీదీ తమ్ముడూ నీకీ వద్లీ షంగంలోకీ పోయ్యాడ్?

మస్తాన్ : ఏం జేస్తాన్ సర్కార్. నెత్తిన నోరుపెట్టుకొని ఎన్నాళ్ళు జెప్పినా వినందే.

అమీన్ : అరే నాలాయఖ్. సుభాన్‌కో బులావో. నాకీ చెప్పి చూస్తా. అచ్ఛా, హెల్మందా హేడీ?

మస్తాన్ : ఎక్కడికో చచ్చాడు. ఇంటిదగ్గర లేడండీ!

వెంక : సరే, నీవెళ్ళి ముందు సుభాన్‌ని దాదాసాయబుని పిల్చిరా. (మస్తాన్ అమీన్‌కు సలాంజేసి వెళ్ళిపోతాడు) సుభాన్‌ని తిప్పడానికి మేమూ ఎంతో ప్రయత్నించామండీ! కాని లాభం లేకపోయింది; అతను చాలా పెంకెమనిషి.

అమీన్ : మీకీ చెప్తే హెందుక్కా హింటాడ్. చూడు, హిప్పూ నాకీ పాంచ్ మినిట్‌లో మార్చేస్తాన్.

[పోలీసు, మంగలి రాముడూ ప్రవేశం]

(అమీన్‌నుచూచి శాల్యూట్ జేసి, పోలీసు అటెన్షన్ పోజులో నుంచుంటాడు.)

వెంక : (పోలీసుతో) ఏం మీకు కావలసిన సామగ్రి అంతా దొరికిందా?

రాముడు : ముందు డబ్బియ్యందే కోమటాయన ఇయ్యనన్నడు దొరా.

జగ : (కోపంగా) ఆఁ, ఏమిటి?

అమీన్ : (పోలీసుతో) క్యారే బేవఖూఫ్, హాడ్కీ జుట్టా పట్టీ హిక్డా హీడ్చుకరాకా హిట్టా సచ్చావ్ బే.

పోలీ : ఏం జేస్తాను హుజూర్ ? వాడికి కుమ్మక్కుగా బడితలు పుచ్చుకోని పదిమంది జనం వచ్చిపడ్డారు.

వెంక : చూశారా, చివరికి కోమటి పానకాలుకూడా మీ పోలీసు కెదురు తిరిగాడు. ఇలా ఉంది వీళ్ళపని.

అమీన్ : ఫోవయ్యా, మీరూ హాడ్కీ హాలూస హిచ్చార్, లేకపోతే హాడ్కీ హింతా ఖలేజా.

పోలీసు : (దేశముఖుతో) ఇయ్యాకపోతే ఇయ్యాకపోగా పైన ఎంతెంత మాటలన్నాడు.

జగ : అంటాడంటాడు. ఎందుకనడు ? ఇవ్వాళ వాడికి చావు మూడింది, అరే రాముడూ, ముందు పోలీసులందరికీ దివాణంలోనే వంటచేయమని చెప్పు.

రాముడు : సిత్తం దొరా, (వెళ్ళిపోతాడు)

వెంక : ఈ బఖాల్ ఎక్కడికిపోతాడో చూద్దాం. ఇంతకింత వీడిదగ్గిర పదింతలు కక్కిస్తాం.

అమీన్ : హాసల్ హిక్డా సంఘం పెద్దా హెవడూ ?

జగ : ఉన్నాడులెండి, ఒక పచ్చిరౌడీ, వీరారెడ్డి.

అమీన్ : క్యా రెడ్డీ ? మీదీ రెడ్డీ మీకి ఎదుర్ తిర్గాడ్ అరే! తోబా తోబా !

జగ : ఛీ! వాణ్ణి రెడ్డి అనడంకూడా సిగ్గుచేటు.

వెంక : ఈమధ్య మాదిగ కొంపల్లోకూడా కూడుతిన్నాడట దౌర్భాగ్యుడు !

అమీన్ : హెక్డాతింటే హేట్టీ, హాదీమస్కీ హెందుకయ్యా, హాడ్కీ పిల్సి రెండూ మంచీమాటల్ సేసీ జేబ్‌లో పెట్కో.



వెంక : అతను అంతంతమాత్రానికి లొంగే పిండంకాదులెండి.

అమీన్ : హేట్టీ సేతాగానీ మాటా సేస్తావయ్యా, హంతీకి కాకపోతే పదీ హెకరాల్ హాడ్కీ హిస్తేసరీ. హెట్టీ సేస్తాడయ్యా మీదీ మాటాహినాక ? హవ్వుటీక హినాకపోతే నాకీ హుండాన్. హాడ్కీ హుండాడ్.

వెంక : చిత్తం అలాగే తమరు సెలవిచ్చినట్టే చేస్తాం.

జగ : ఎవడురా అక్కడ ? (రాముడు ప్రవేశం) అరేయ్, అమీన్‌సాబ్‌గారు రమ్మంటున్నారని వీరారెడ్డిని పిల్చిరా.

రాముడు : సిత్తం దొరా (వెళ్ళిపోతాడు)

[మరోవైపునుంచి మస్తాన్ ప్రవేశం]

జగ : ఏం, వచ్చారా ?

మస్తాన్ : వచ్చారు మహారాజ్ !

వెంక : లోపలికి రమ్మను (మస్తాన్ బైటికి వెళతాడు)—(అమీన్‌తో) మేంకూడా ఉండడం అంత మంచిది కాదనుకుంటాను.

జగ : వెళతాం. వాళ్ళతో మీరొక్కరే మాట్లాడండి.

అమీన్ : అచ్ఛా ! అచ్ఛా !

(జగన్నాథరెడ్డి వెంకట్రావులు వెళ్ళిపోతారు. అమీన్ సిగరెట్టు ముట్టించి పీలుస్తూ ఉంటాడు. మస్తాన్‌తోపాటు దాదా సుభానుల ప్రవేశం)

అమీన్ : (బెంచ్ చూపిస్తూ) ఆవ్ భాయీ ఆవ్, బైఠో.

దాదా : ఎందుకులెండి ఇక్కడే నుంచుంటాం.

అమీన్ : అరే మీకీ మాకీ తేడా హేమ్టీ, మంది మతంలో హంతాహొక్టే. బైఠో.

దాదా : ఎట్లాగైనా మీరు మహారాజులు, మాదేముంది లెండి బిక్కాపకీర్లం.

సుభాన్ : ఇంతవరకెవ్వుడూ ఇక్కడ కూర్చొని ఎరగం, కొత్తగా ఇవ్వాళెందుకు లెండి, మమ్ముల్ని పిలిపించారట ఎందుకు?

అమీన్ : మీకీకూడా షంగంలో చేరాగ్గాదూ?

సుభాన్ : ఆఁ చేరాం.

అమీన్ : అరే! మీకీ కాఫిర్లా (హిందూ) షంగంలో సేరార్? నాకీ హెక్డాసూడలా. హిదీ హేమ్టీ భాయీ క్యా దాదా, నీకికూడా షంగంలో చేరావ్?

మస్తాన్ : ఏదో తెలవక చేరారు లెండి.

సుభాన్ : తెలిసేచేరాం. ఇది కాఫిర్లసంఘంకాదు. బీదోళ్ళ సంఘం.

అమీన్ : బీదోళ్ళాషంగం! (వెకిలినవ్వునవ్వి) అరే దీవానా, నీకీ హెమ్టి తెల్సు, హిందువుల్కీ చేసే కిలాడి.

దాదా : ఇక్కడ అదంతా ఏమీ లేదులెండి? అంతాకలిసే ఉంటాం.

సుభాన్ : ఇందులో హిందువులుచేసే కిలాడి ఏముంది?

అమీన్ : కిలాడీగాకపోతే హేమ్టీ. మన ఆసఫ్‌జాహీ సర్కార్‌కీ బోల్తా కొట్టించే హందూక్ హాల్కీ షంగం పెట్టార్. మీరూపోయి బరాబర్ హాల్కీ ధోఖాలో బడ్డార్.



సుభాన్ : పైనుంది ఆసఫ్‌జాహీసర్కారో, అంగ్రేజ్ సర్కారో. మాకంటికి కనపడేది మాత్రం యీ దేశముఖు సర్కారే.

అమీన్ : అరే, ఈ దేశముఖుదీ హేమ్టీవుందోయ్? హీళ్ళా హందర్కీపైనా మందీ నవాబ్ హుండాడ్. హీళ్ళా హంతా హాయనా హెట్లాసెప్తే హట్లా సేయ్‌వాలి.

దాదా : అయితే ఈజరిగే జులుం అంతా ఆయనగారే చేయమన్నాడా ఏమిటండీ?

సుభాన్ : అవును. ఇదంతా ఆయనగారి చలవే.

అమీన్ : అరే హేమ్టి హట్లా అంటావ్. మందీ నవాబ్ లేకాపోతే నీకీ హెక్డా హుండే వాడివ్.

సుభాన్ : ఎక్కడుంటాం? ఇక్కడే ఉంటాం. ఈయనఉండి మాకొరిగించిందేముంది? ఈయన లేకపోతే మాకు పోయేదేముంది? గోచికి మించిన దరిద్రమేమిటి?

అమీన్ : అరే! మందీ రాజ్యం చేసేజాతి, హేమ్టీ బానిసా మాటాస్తావ్?

దాదా : ఏమి రాజ్యమో, ఏమిరాజులమో?

సుభాన్ : రాజులం! (చినిగిన చొక్కాను చూపిస్తూ) కనపడతానే ఉందిగా దాదా, మనరాజులదర్జా!

అమీన్ : క్యారే! నీకీమతం మట్టీ లేదూ హేమ్టీ?

మస్తాన్ : కాఫిర్ల దోస్తీబట్టి తిరిగేవాడికి ఇంకా మతమేమిటీ? మట్టేమిటి?

దాదా : గుడ్డొచ్చి పిల్లనెక్కిరించినట్టు నీవుకూడా మాకువంక బెట్టబోతన్నావా? నీ జీవితంలో అసలెప్పుడన్నా నీవు నమాజ్ జేసి ఎరుగుదువ్?

సుభాన్ : (నవ్వుతూ) ఆయన జేయకపోవడమేం దాదా? నీవు రోజుకయిదుసార్లు అల్లాకి సలాంజేస్తే ఆయన రోజుకి యాభైసార్లు సలాము కొడతాడు.

దాదా : ఎవరికి?

సుభాన్ : ఎవరికా? దేశముఖు జగన్నాథరెడ్డిగారికి.

అమీన్ : క్యారే గంవార్, నీకి మర్యాదా, మంచీ హేమీ లేదు.

సుభాన్ : పేదముండాకొడుకులికి మాకీ మర్యాదలెందుకు లెండి. కడుపులోకి కాస్త మేతపడితే చాలు.

అమీన్ : ఏయ్ సుభాన్! నీదీ మంచీకోరి చెప్తన్నా హినోఁ. మీకీ సంగం కావాలంటే మందీ వేరే సంగంహుంది, హాందులో మీకీ చేర్తే మంచీ హుంటాది.

దాదా : ఏమిటి బాబూ ఆ సంగం?

అమీన్ : మజలీసే ఇత్తిహదుల్ ముస్లిమీన్.

దాదా : ఎక్కడుంది అది? మేమెప్పుడూ దానిపేరన్నా విన లేదే!

సుభాన్ : ఉందిలే దాదాఒకటి, జాగీర్దార్ల సంఘం.

అమీన్ : అరే జాగీర్దార్ హేమ్టి, నౌకర్ హేమ్టి, మందీ ముసల్మాన్లంతా హాందులో కల్వావచ్చు.

సుభాన్ : దేనికి? జాగీర్దార్ల నౌకరీచేయడానికా? ఇప్పటి కీ దేశముఖులతోనే చచ్చిపోతన్నాం. ఇంకా జాగీర్ దార్ల కొలువెందుకులెండి?

అమీన్ : మన్కీ ముసల్మానుల్కీ హిట్టా హుండాం కాబట్టే బీహార్లో హిందువుల్ మన్కీ సఫాసఫా జేస్తుండార్.



సుభాన్ : బెంగాల్లో మనవాళ్ళూ చేసిందదేగా? బీహార్లో బెంగాల్లో పంజాబ్లో—ఎక్కడ జచ్చినా చివరికి మాబోటి పేదోళ్ళేగా?

అమీన్ : హాయితే హింత్కీ మీరు ఆ కాఫిర్లా సంగం లోనే హుంటార్!

సుభాన్ : కాఫిర్లమీద నిజంగా మీకంత కోపమేఉంటే, ఈ దేశముఖు ఇంట్లో ఎందుకు మకాంబెట్టారండీ! ఆయన మట్టుకు కాఫిర్గాడా? ముసల్మానా?

అమీన్ : (కోపంతో బల్లగుద్ది కండ్లురుముతూ) ఆరే గధా, (గాడిదా) నీకీ ఫకీర్కీ హుండావ్, ఆయన్కీ మహ రాజ్కీ వంకా బెట్టావ్.

సుభాన్ : చూస్తన్నావా దాదా. మతమేదయితే ఏం. చివ రికి ఫకీర్లు ఫకీర్లే. దొరలు దొరలే.

దాదా : పద! ఇక్కడికొచ్చి పైగా మాటలు పడడం ఎందుకు? (ఇద్దరూ వెళ్ళబోతారు)

అమీన్ : (లేచి) ఏయ్ బూఢా, ముసల్మాన్కీ పుట్కా పుట్టార్ గాబట్టి మీకీవద్లీ పెడ్తండా. హిప్పట్కీ హాయినా బుద్ధిగల్గీ బత్కండి. మళ్ళీమళ్ళీ చెప్తండా.

[దాదా సుభానులు వెళ్ళిపోతారు. అమీన్ మళ్ళీ ఒకడోసు వేస్తూ వుంటాడు]

మస్తాన్ : అసలు చేసేదంతా ఈముసలాడే. చూడండి పైకి ఎంత పిల్లిలాగా కనపడతాడో!

అమీన్ : హూక్టీ దెబ్బకీ హంతా వదుల్తాది. హీడ్కీ గోరీ కట్టించ్కాపోతే చూడు నాదీ దెబ్బ!

[దేశముఖ్ పట్వారీల ప్రవేశం]

దేశ : క్యా అమీన్ సాబ్, దారికొచ్చారా ?

అమీన్ : హాళ్కీ పంగంపిచ్చీ బాగా తల్కీపట్టింది. ఖాలీ మాటల్కీసేస్తే హింటార్ ?

జగ : ఇవ్వాళ మాటలతో వినకపోతే రేపు లాఠీలతో వింటారు. సరే, మీరు వచ్చి చాలాసేపయింది, కొంచెం విశ్రాంతి తీసుకోండి. (రాముడువచ్చి నుంచుంటాడు) ఆ వచ్చే వాడి వ్యవహారం నేను చూస్తాను.

అమీన్ : అచ్ఛా అచ్ఛా, నాకీ హెళ్కీ జరా ఆరాంసేస్తా. మీదీ మాటాహినాకపోతే నాకీ ఖబర్ చెయ్.

(మస్తాన్ దారి జూపుతూ ఉంటాడు. అమీన్ వెళ్ళిపోతాడు)

వెంక : ఏంరా ! అతను వచ్చాడా ?

రాముడు : ఆఁ వచ్చిన్రు అయ్యగారూ;

వెంక : సరే, తీసుకరా (దేశముఖ్ కుర్చీమీద, వెంకట్రావ్ బల్లమీద కూర్చుంటూ ఉంటారు)

[రాముడు వెళ్ళి మళ్ళీ వీరారెడ్డితో ప్రవేశిస్తాడు]

జగ : అరే రాముడూ, వెళ్లు, నీవు నీపని జూసుకో.

[దణ్ణంబెట్టి రాముడు వెళ్ళిపోతాడు]

జగ : (నవ్వుమొఖంతో లేచి వీరారెడ్డిదగ్గిరకెళ్ళి) ఏమిటోయ్ వీరారెడ్డి ! ఈ మధ్య నీకేదో ఉద్యోగం దొరికిందని విన్నానే నిజమేనా ?

వీరా : నాకా ! ఉద్యోగం ? అసలునేనెప్పుడూ ప్రయత్నించ లేదే!



జగ : అలాగా ! (పట్వారీ వైపుజూచి) ఏమిటయ్యా అలా అన్నావ్ !

వెంక : ఈ మధ్య ఏదో ఆఫీసులో ఉన్నాడని మావాడన్నాడు లెండి.

వీరా : అవును, ఈమధ్య కొన్నాళ్లు జిల్లా ఆంధ్రసంఘం ఆఫీసులో ఉన్నాను. కాని అదేమీ ఉద్యోగం కాదే!

వెంక : (నవ్వుతూ) ఇంకేం ! దాన్నిబట్టే మావాడలా అనుకున్నాడేమో లెండి.

జగ : ఎక్కడో జిల్లాలో పోయి పడిఉండడం ఎందుకోయ్ వీరారెడ్డి; కావాలంటే నేనివ్వనూ నీకిక్కడఉద్యోగం?

వీరా : నాకెందుకు ? అసలునేను ఉద్యోగం చేయదల్చుకో లేదు.

జగ : అది మంచిదే కాని, అసలు మన కులంలో చదువుకున్న వాళ్ళే తక్కువ. చదువుకున్న నీ బోటోళ్లు ఒకళ్ళా, అరా ఇలాగే అనుకుంటే యింకా మనవాళ్లు ఎలాపైకి వస్తారు ?

వెంక : ఏమిటయ్యా, తెలిసినవాడివి నీవుకూడా అట్లా మాట్లాడతావ్ ? ఎన్నాళ్ళు తంటాలు పడతావ్ ఆ నాలుగెకరాలతో ?

వీరా : ఏదో మాఅవస్థ మేం పడతాం లెండి!

జగ : (వీరారెడ్డి భుజంమీద చరుస్తూ) ఉద్యోగం లేకపోతే నీవేదో ఒకవిధంగా బ్రతకలేవనికాదు నేను చెప్పేది. నేనా ఒక్కణ్ణి; వ్యవహారాలేమో రోజురోజుకీ పెరిగి పోతున్నాయి. ఎన్నని సర్దుకోను ?

వీరా : అయితే నన్నేం చేయమంటారు ?

జగ : మనలో చదుకున్నవాడివి నీవుండగా నాకెందుకీభార మంతా? పోనీ, పటేల్ గిరీతీసుకో, నీ ఇష్టంవచ్చినట్టే గ్రామాన్ని నడుపు. నేనేదో చేస్తున్నానని మీరంతా అనుకోవడ మెందుకు ?

వెంక : ఏమిటయ్యా పిచ్చోడా, ఇంకాఆలోచిస్తావు. కొండంత అండదొరికింది. అదృష్ట వంతుడివి; ఎద్దుముడ్డి పొడుచు కునేరాత నీకేం పట్టింది?

వీరా : పటేలంటే ఏమిటో నాకు తెలుసులెండి, నాకేం అక్కర్లేదీ ఉద్యోగం.

జగ : సరే, నాచేతనైన సహాయమేదో చేస్తానన్నాను. తర్వాత నీయిష్టం.

వెంక : ఏమిటయ్యా వీరారెడ్డీ, నీమీద ఇంత అభిమానంగా ఉన్న ధొరవారికి వ్యతిరేకంగా నీవు పనిచేయడ మంటే నాకేంబాగుండలే.

వీరా : ఎందుకండి బాబు నామీద మీకంత అభిమానం ?

వెంక : ఎలాగైనా ధొరవారి కులస్థుడివి.

వీరా : కులం అంటే నేనొక్కణ్ణే కాదుగా, ఊళ్ళో మూడు వంతులు రేడ్లే.

వెంక : కాబట్టే చెప్పుతున్నాను. రెడ్లే మనరెడ్డి ధొరవారికి వ్యతిరేకంగా పనిచేయడం ఏం సబబు ?

వీరా : పండ్లూడ గొట్టుకోడానికి ఏరాయి అయితే ఏముం దండీ వెంకట్రావుగారూ ?



వెంక : శివశివా! చల్లని ప్రభువు నెంతమాటన్నావయ్యా? అదిగోచూడు! ఆ ఎదురుగా ఉన్న రామమందిరం కట్టించిందిధొరవారుకాదూ? అలాంటి పుణ్యా త్ముణ్ణి.......

వీరా : అవును గొప్పపనిచేశారు. అరక్క పాతిక రూపా యల చొప్పున వసూలుజేసి కట్టించారు. ఎడ్లతో బండ్లతో నానా అవస్థలు పడి రాయీ రప్ప తోలింది మేము. చివరకు పేరుమాత్రం దొరగారిది.

[దేశముఖ్ వీరారెడ్డివైపు గుడ్లు మిటకరించిచూస్తూ ఉంటాడు.]

వెంక : చాల్లేవయ్యా, బయల్దేరావ్ ఈనాటికి పెద్ద దేశభక్తుడివి. నీమాత్రం దేశభక్తి అందరికీ ఉంది. (కట్టుపంచ చూపుతూ) మిల్లుబట్టమానేసి ఆరుమాసాలనుంచి నేనూ ఖద్దరు కడతున్నాను. ఏమిటనుకున్నావో!

వీరా : అబ్బో! గొప్ప త్యాగమే చేశారు!

జగ : చేసినా మేమే చెయ్యాలి. నీవేం చేస్తావోయ్. సన్యాసీ సన్యాసీ రాసుకుంటే బూడిదే రాలేది.

వెంక : అంతే, మొన్న కస్తూరిబాఫండుకి డబ్బుగావలసివస్తే ధొరవారు నాలుగువేల రూపాయలిచ్చారు. నీవేం ఇచ్చావ్?

వీరా : అవును. మీలాగే ఆవుల్ని జంపి చెప్పులు దానంచేసే ప్రభువులు చాలామంది ఉన్నారు, కాంగ్రెసు పేరు నాశనం చేయడానికి. ఇంకేం మీరుకూడా కాంగ్రె సులో కలవక పోయారా ?

వెంక : అవును మేము కాంగ్రెసే. మొన్న నరసయ్యగారు, రామారావుగారు వచ్చినప్పుడు ఎక్కడ మకాం జేశారూ, మా దివాణంలోనా ? మీ గుడిసెలోనా ?

వీరా : ఎందుకు మకాంచేయరు ? అందులో ఒకరు దేశముఖ్, మరొకరు జాగీర్దారు.

వెంక : ఏమయితే, నీవు వారికంటె గొప్ప దేశభక్తుడవా ?

వీరా : నేనేం దేశభక్తుణ్ణిలెండి ? మీబోటి దేశముఖుల, పట్వారీల పంచజేరిన ఆ పెద్దమనుషులే దేశభక్తులు. అలాంటి దేశభక్తుల చేతులతో కాంగ్రెసు తీర్థం పుచ్చుకున్న మీరు అంతకంటె గొప్ప దేశభక్తులు.

వెంక : నీకుతోడు వాళ్లకు వంకబెట్టబోయావ్. అసలు గాంధీగారు చెప్పిందేమిటి ? నీవు చేసేదేమిటి ?

వీరా : అదేమిటో తమరే సెలవివ్వండి.

వెంక : అసలు ఆ మహాత్ముడేమన్నాడు ? రైతులకు, దేశముఖులు, జమీందార్లు, ధర్మకర్తలుగ ఉండాలన్నాడు. నీ వెక్కడో నాలుగు గాలికూతలు నేర్చుకొని అసలు దేశముఖులే పోవాలన్నావటగా నిన్న మీటింగులో.

వీరా : హ్హుం, రైతులకు దేశముఖులు ధర్మకర్తలు ! మేకలకు తోడేళ్లు కాపలా అన్నమాట.

(అమీన్‌ను పిలవమని దేశముఖ్ మస్తాన్‌కు సైగ జేస్తాడు)

జగ : ఆ లుచ్చాతో ఎందుకోయ్ కంఠశోష ? చెప్పుతినే కుక్కకు నెయ్యికూడు ఇముడుతుందా ?



వీరా : ఇది నెయ్యికూడు కాదు. విషపుకూడు. ఇలాంటి ఆశలు బెట్టే ఇదివరకు కొంతమందిని బోల్తాకొట్టించారు. కాని ఇక ఆ మంత్రం అందరిమీదా పారదు. మీ పని మీరు జేసుకోండి. మా పని మేం జేసుకుంటాం.

(వెళ్లబోతాడు)

[అమీన్ ప్రవేశం]

జగ : అమీన్‌సాబ్ ! (వీరారెడ్డిని అరెస్టుజేయమని సైగ జేస్తాడు.)

అమీన్ : ఏయ్? ఠైరో.

(వీరారెడ్డి నుంచుంటాడు)

(వీరారెడ్డి దగ్గరకెళ్లి) గిరఫ్తార్.

(పోలీసులు వీరారెడ్డి చెరొకచెయ్యి పట్టుకుంటారు)

వీరా : కారణం ?

అమీన్ : కారణం ! (అమీన్, దేశముఖ్, పట్వారీలు వికటంగా నవ్వుతూ ఉంటారు)

(తెరబడుతుంది)

# V

## వీరారెడ్డి ఇల్లు

[సీతమ్మ నాయకుల ఫోటోలు తీసి తుడుస్తూ, సామాన్లు సర్దుతూ పాడుతూ ఉంటుంది.]

గీతము పాడగదే – సోదరి !
గీతము పాడగదే – ॥గీతము॥

[గాంధీజీ ఫోటో చూచి]

దున్నేవారికె అన్నిహక్కులని
దోచేవాడికి దోహదమీనని
పలికిన పలుకులు నిలుపుకోనాలని ॥గీతము॥

[నెహ్రూ ఫోటో చూచి]

తిండిసిదోచే దుండగులందరి
గుండెలచీల్చే కుత్తుకనులిమే
తరుణమిదేగద త్వరపడవేమని ॥గీతము॥

[ఆంధ్రమహాసభా నాయకుని ఫోటో చూచి]

రాక్షసిమూకల రక్తపిపాసుల
నురుమాడుటకై పరుగున రండని
పిలిచిన పిలుపును విని కదిలామని ॥గీతము॥

[కమల ప్రక్కనుండి వింటూ పాట పూర్తి అవుతూ ఉండగా ప్రవేశిస్తుంది. దాదా, సుభానలుకూడా బైటినుంచి ప్రవేశిస్తారు.]

దాదా : (నవ్వుతూ) మమ్మాయి అప్పుడే సంఘం పాటలు కూడా నేర్చుకుందే !



సుభా : కమలమ్మ ఇంట్లో ఉండగా ఇంకా పాటల కేం తక్కువ ?

కమల : (చిరునవ్వుతో) మా వదినకు నేను నేర్పేదేముంది ? మన్నయ్యే నేర్పాడు.

దాదా : అవునులే ! మమ్మాయికి అన్నయ్య నేర్పాడు. రేపు వచ్చే మా మనమడికి నీవు నేర్పు.

సీత : ఈమె ఆయనకేం నేర్పనక్కరలేదులే. ఆ అబ్బాయి కూడా సంగం పెద్దేగా !

దాదా : ఇంకేం ! చిక్కులేదు. ఇద్దరూ చెరొకజెండా వేసుకొని ఊళ్ళెమ్మటి తిరగొచ్చు ! (కమల సిగ్గుతో తల వంచుకుంటుంది. సీతమ్మ నవ్వుతుంది.)

సుభాన్ : (సీతమ్మతో) ఏం వదినా, అన్నయ్యేడీ, ఎక్కడికెళ్లాడు ?

సీత : మీకు కన్పడలా ? మీ వెనకమాలే వచ్చారుగా !

దాదా : ఎక్కడికి ? గడీకా ?

సుభాన్ : అక్కడికొస్తే మాకు కన్పడాలిసిందేగా !

కమల : రాముడొచ్చి అమీన్ రమ్మన్నాడని పిల్చాడు. మీరుకూడా గడీకే వెళ్లారని తెలిసి అన్నయ్యకూడా అక్కడికే వచ్చాడు.

దాదా : అట్టాగా. అయితే ఆయనేదారిని.యెళ్లాడో ? మేం ఏదారిన వచ్చామో !

సుభాన్ : రానియ్, ఆయన దగ్గి రేంనాటకం ఆడుతున్నాడో అదీ తెలుసుకుందాం.

కమల : ఏమిటా నాటకం ?

దాదా : ఏముంది? ఏదో ఒకవిధంగా మమ్ముల్ని బుట్టలో వేసుకోవాలని చూశాడు.

కమల : మిమ్ముల్నే బుట్టలో వేసుకోవాలని చూశాడుగా! ఏమన్నాడేంటి?

సుభాన్ : ఏమంటాడు! మీరంతా హిందువులంట. మేం సాయిబులమంట! నవాబుకు వ్యతిరేకంగా సాయిబులు పనిచేయడం తప్పంట! పాపమంట!

కమల : ఆయనకేం నవాబు! కొన్ని కోట్లరూపాయిలున్నాయి. మరి మీకెన్ని కోట్లున్నాయి?

దాదా : లేకేం, నాకూ ఉన్నాయి చినిగిపోయిన రెండు పాతకోట్లు.

సుభాన్ : ఎక్కడివి. నీ పెండ్లికి కుట్టించినయ్యా?

దాదా : (నవ్వుతూ) అబ్బో! నా పెండ్లికి తోడు రెండు కోట్లు కూడానా, అందులో ఒకటి మా అయ్యదిరా.

[అందరూనవ్వుతూఉంటారు, రామిరెడ్డి ఎల్లమందల ప్రవేశం]

యల్ల : (వస్తూనే) నాయాళ్ళు! యల్లమందంటే ఏందో అల్లాటప్ప అనుకున్నరు!

దాదా : ఏం! మాజోరుగా ఉంది? వేశావా ఏంటి రెండు ముంతలు?

యల్ల : ఏంది కల్లా? కల్లు! సంగం పొత్తుకంలో యేలద్దిన్నాడే ముంతపగలనూకినా, ఏందనుకున్నవో!

దాదా : అయితే ఇవ్వాళ మస్తాన్ ఏమన్నా నీచేతికి చిక్కాడా ఏంటి?

యల్ల : మత్తానయ్యే చిక్కినట్టయితే అబ్బా! టుర్రు, కీ...

[అందరూ నవ్వుతారు]



రామి : తస్సదియ్య! ఇయ్యాల యల్లమంద వంకకర్ర తిరగేసి నాసామిరంగా దంచో దంచు!

సుభాన్ : ఎవర్ని? ఏమిటి?

సీత : ఏమిటి రామయ్యా! అసలెవర్ని కొట్టింది?

యల్ల : ఎవర్నేంది? తాడీసుని,

దాదా : ఎందుకు? ఏం జరిగింది?

రామి : నాకసలు నిద్రబట్టిందా, నాగిత్త పోయిన కాడనుంచి. దివాణపు గొడ్లన్నీ చెరువు కెట్టాగూ రావాలిగా! మనాళ్ళందర్నీ తీసికెళ్ళి ఇయ్యాల కాపలాగాశా. ఎక్కడకి పోతంది దొరక్క, దాని అబ్బగాడికి బాకా? నీళ్ళు తాగుతూ ఉండగా పోయి గిత్తని పట్టుకున్నా.

సీత : వాళ్ళు చూస్తూ ఊరుకున్నారా?

రామి : ఆళ్లెవళ్లు అక్కయ్యా, ఆడి పాలేళ్ళంతా మన సంగంలోనే ఉండారుగా!

యల్ల : పెద్ద మొగోళ్ళులాగా ఎవళ్ళో ఇద్దరుతాడీనాయాళ్ళు వచ్చిన్రు జుట్టెగరేసుకుంటూ.

సుభాన్ : (నవ్వుతూ) అదాసంగతి! ఆళ్ళిద్దరిపనీ నీవుబట్టా వన్నమాట.

కమల : భలే పనిజేశావ్ యల్లమందా, సరే కూచో. (యల్లమంద లోపలికెళతాడు)

రామి : మనదేముంది సుభాన్. అసలు గూడెం వెళ్ళాలి, కనపడాలి. ఏం కట్టుగాఉంది! చెరువుదగ్గిరకాస్తి గల్లంతు జరిగేటప్పటికి గుతపలు (లాఠీలు) తీసుకొని గూడెం అంతా కదిలి వచ్చిందనుకో మనతరపున.

సుభాన్ : అవునుమరి, ఈ దేశముఖు గూడాన్ని బెట్టిన తిప్ప లిన్నా అన్నా. నిలువునా వాళ్ల ప్రాణాలుతోడాడనుకో. దేశముఖుని ఇవ్వాళ గూడెంలో అడుగుబెట్టమను, కనబడుతుంది వాడిబతుకు.

దాదా : నిజమే, వాళ్ళుకూడా మనతో పాటు చావుకీ బతుకీ తయారయ్యారు. కాని గింజలు దొరక్క పాపం, వాళ్ళుచాలా ఇబ్బందిపడతన్నారంట.

కమల : పాపం, వాళ్ళు అలా ఇబ్బందిపడుతూ వుంటే మనం మాత్రం చూస్తూ ఎలా ఊరుకుంటాం. మన చేత నైన సహాయమేదో చేయాలిగాని.

సీత : మనకున్న దాంట్లోనే కాసిని వాళ్ళకిచ్చి కాసుక తాగ మందాం. గానుగలోదే గంటెడు; ఏం జేస్తాం?

దాదా : అంతేలే అమ్మా, తర్వాత తిప్పలేమన్నాగానీ.

(యల్లమంద పలకతీసుకొచ్చి రొండినఉన్న చెకుముకి సంచి తీసి అందులోనుంచి బలపం తీస్తూ ఉంటాడు.)

రామి : అదేమిటోయ్ యల్లమందా, నీకు పలకెందుకు?

యల్ల : అచ్చరాలు రాపిచ్చుకోవాలి అమ్మాయిసేత.

(కమల చేతికి పలకా, బలపమూ యిస్తాడు)

దాదా : (ఆశ్చర్యంగా) ఓరి నీదుంపతెగ! ఇప్పుడేం చదువోయ్ నలభై ఏళ్ళు వచ్చాక ?

యల్ల : ఓయ్, సదువుకోకపోతే ఎట్టా! మన సంగంవారు యేసేకాగితాలు సదువుకోవద్దూ మరి?

(అంతా నవ్వుతారు)



రామి : తప్పదయ్యా ! అట్టా ఉండాలి పట్టుదలంటే !

సీత : చదువేమిటి ! పాటలుకూడా నేర్చుకుంటున్నాడుగా అమ్మాయిదగ్గిర !

దాదా : ఓరి నీయేటుగాల ! మాఅందరికంటే నీవే మెరుగే! ఏదీ ఒకపాటపాడు.

యల్ల : వాయ్, పాటలు నాకేం వత్తయ్.

రామి : ఈవేషాలన్నీ కుదరవులేవోయ్. మా అక్కయ్య అబద్దంఆడకేం ! ఊఁ పాడవోయ్, పాడు. (అంటూ చేయిబట్టి లాగుతూవుంటాడు.)

సీత : నామాట అబద్ధమయితే పంతులమ్మగారెదటే ఉందిగా అడగండి ! (కమల నవ్వుతుంది)

సుభాన్ : సంఘంపాటలు నేర్చుకుంది దాచుకోడానికా యేం ? పాడవోయ్, మనకు భయమేమిటి ?

యల్ల : పాట లెందుకయింది నాకువచ్చింది, సుద్దులైతేను.

రామి : సుద్దులైతే మరీమంచిది. తప్పకుండా పాడాలిసిందే.

కమల : ఇక తప్పదులే పాడు యల్లమందా.

యల్ల : ఒక్కణ్ణి ఎట్టబాడను ? 'ఆఁ' కొట్టేవాళ్ళుండొద్దా.

రామి : నేనూ, సుభాన్ ఆఁకొడతాంలే కానియ్, రా సుభాన్. (సుభాన్, రామిరెడ్డి యల్లమందకు చెరొక ప్రక్కన నుంచుంటారు. చెవికి చేయి ఆనించి యల్లమంద 'ఆఁ' అంటూ శ్రుతిగలుపుతాడు.)

యల్ల : ఏందయ్యా, ఆఁ కొట్టకుండా యికిలిత్తారేం ?

సుభాన్ }
రామి } సరే కానియ్, (ఇద్దరూ 'ఆఁ' అంటూ అతని శ్రుతిలో గలుపుతారు.)

యల్ల : — సుద్దులు —

హరి హరి నారాయణ ఆదినారాయణ
కరుణించి మమ్మేలు కమలలోచనుడ॥
గొర్రెల గోత్రాలు గొల్లల కెరుక
గొల్లల గోత్రాలు గొర్రెల కెరుక
గొర్రె గొల్లల గోత్రాలు తోడేళ్ళ కెరుకో॥
పటేళ్ళ గోత్రాలు అమీన్ల కెరుక
అమీన్ల గోత్రాలు పటేళ్ళ కెరుక
అమీను పటేళ్ళ గోత్రాలు
గ్రామత్తుల కెరుకో ॥
దేశముఖుల గోత్రాలు జాగీర్దార్ల కెరుక
జాగీర్దార్ల గోత్రాలు దేశముఖుల కెరుక
దేశముఖ జాగీర్దార్ల గోత్రాలు
ఆంధ్రమాసబ కెరుకో॥
నైజాము గోత్రాలు కుంపినోళ్ళ కెరుక
కుంపినోళ్ళ గోత్రాలు నైజాము కెరుక
నైజాము కుంపినోళ్ళ గోత్రాలు
మా సంగం వారికెరుకో॥

(సంతోషంగా అందరూ చప్పట్లు కొడతారు.)

దాదా : షెబాస్! బలేగా పాడావ్ యల్లమందా.



కమల : మరేమిటనుకున్నారు యల్లమందంటే! చూడండి. పదిరోజుల్లో మనసంఘం పేపరే చదివేస్తాడు.

(యల్లమంద నవ్వుతూ గొంగళి కిందేసుకొని కూర్చొని అక్షరాలు దిద్దుకుంటూ ఉంటాడు.)

దాదా : మరచిపొయ్యాను. అసలియ్యాల మన సంగం పేప రొచ్చిందా?

రామి : రాకపోవడమేమిటి? నేనేగా రాత్రి తెచ్చింది!

సీత : దీపంబెట్టుకొని రాత్రి నడిజాందాకా చదువుతానేఉంది అమ్మాయ్.

దాదా : ఇయ్యాల సంగతులేందో చెప్పలేదేం అమ్మాయ్.

సీత : కుంపిణీనుంచి ఎవళ్ళో మన దేశం చూట్టానికొస్తే వారి మీదకూడా తుపాకులు కాల్చారంట! వీళ్ళ చేతులిరగ!

దాదా : ఎవళ్ళు? బందరునుంచి వచ్చిన ఆ పెద్దమనుషుల మీదనా. ఆ సంగతి మనకిదివరకే తెలిసిందిగా.

రామి : కుంపిణీనుంచి వాళ్ళసలిక్కడికెందుకొచ్చారు సుభాన్?

సుభాన్ : మన కష్టసుఖాలు తెలుసుకోడానికే.

యల్ల : మన కట్టసుకాలు తెలుసుకొని కుంపిణీలో వాళ్ళేం జేత్తారేంటి?

సుభాన్ : కుంపిణీలో వాళ్ళంటే ఎవళ్ళు; వాళ్ళూ మన తెలుగోళ్ళేగా. మనం కష్టపడుతూఉంటే మనాళ్ళు చూస్తూ ఊరుకుంటారా ఏమిటి? ఇక్కడ జరిగే సంగతులన్నీ కండ్లారచూసి అక్కడకెళ్ళి మనాళ్ళందరికీ చెప్పుదాం అని వచ్చారు.

యల్ల : అదిగదీ సంగతి! మళ్లీ ఇంటికెళ్ళినాక ఈడ జరిగే అన్నేయమంతా మనాళ్ళకుజెప్తారుగా. అందుకనే అసలు ఆళ్ళను జంపేత్తే ఏపీడా లేదనుకున్నారు దొంగ నాయాళ్ళు.

దాదా : ఇదంతా చేయించింది ఆ ప్రతాపరెడ్డేగా?

కమల : అవును ఆదుర్మార్గుడే!

రామి : ఎవడు? ఆ లక్షుమ్మెప్పేవేల ఎకరమోడా?

సుభాన్ : వాడే, ఊళ్ళకూళ్ళు లేవగొట్టి తోటేసుకున్నాడే!

యల్ల : తల్లి సిగదరగ! తోటంటేతోటా! ఒకసారి దారి పయాణంబోతా, తోటకీదరిని సద్దిదాగి బయల్దేరితే మళ్ళీ ఆదరికెల్లేటప్పటికి పొను గూకిందంటే నమ్ము.

కమల : నిజమే అలాంటి పెద్దతోట మొత్తం మన భారత దేశంలోనే లేదంట!

సుభాన్ : వాడిముల్లేం బోయింది. ఎంతతోటైనా వేయి సాడు. చుట్టుపక్కల ఊళ్ళవాళ్ళందరిచేత వెట్టి జేయించి.

కమల : వేయించినన్నాళ్ళు వేయించాడు. ఇక ఆ పప్పులేమీ ఉడకవ్. ఆ ఊళ్ళన్నీ ఇప్పుడు సంఘంలో జేరాయి.

యల్ల : (హుషారుగా చంకలుగొడుతూ) చేరినయ్! ఇక కూసోని ఏడవమను.

సీత : సంగంలో జేరినందుకు మన్ని వీడే ఇన్నిఇబ్బందులు పెడతన్నాడు. ఇక వాడెన్ని చెరలు పెడతన్నాడో వాళ్ళని.



సుభాన్ : ఎందుకు బెట్టడు. పోలీసుల్ని తీసుకొచ్చాడు. పట్ట పగలే కొంపలు దోయిస్తున్నాడు. ఆడోళ్ళ పరువు దీయిస్తున్నాడు. వాడు చేయగలిగినదంతా చేస్తానే ఉన్నాడు. చివరికిప్పుడు మిలిటరీ వాళ్ళనికూడా ఊళ్ళల్లో దింపాడు.

యల్ల : యెవళ్ళని,సిపాయోళ్ళనా? ఆళ్ళు మరీ కటికోళ్ళంటగా.

కమల : అయితేం? ఎలికబోను ఎలిక్కే ఉంటుంది. పులి బోను పులికే ఉంటుంది. వాళ్లెలికేస్తె మనాళ్ళు కాలికేస్తున్నారు.

దాదా : ఏం వేస్తే ఏంలాభం? వాళ్ళకి తుపాకులున్నాయ్, మనకి లేవు.

యల్ల : అదేనే సిన్నయ్యా, అసలొచ్చిన సిక్కు. నాకుమల్లె ఆణ్ణి కఱ్ఱబట్టుకొని బఱ్ఱిమీదికి గమ్మను. కనపడద్ది దెబ్బకి నాయాలు టుర్ర్. కీ...

సుభాన్ : అందుకనే వీలున్నప్పుడు దెబ్బకిదెబ్బ తీస్తాం. వీలు తప్పితే తప్పుకొని ఆత్మరక్షణ జేసుకుంటాం.

యల్ల : ఆత్మరచ్చన! అదేందయ్యా సుబానయ్యా!

కమల : 'ఆత్మరక్షణ' అంటే ఏంలేదు యల్లమందా, మన్ని మనం కాపాడుకోవడమే.

యల్ల : (పకపక నవ్వుతూ) ఏంది? మన్ని మనం కాపాడు కోటం? ఓయ్! మరి మన్ని మనం గాపాడుకోపోతే మత్తానయ్య గాపాడతడా? ఇకరెండు చేతుల్తో బువ్వదిన్నట్టే.

సుభాన్ : అందుకనే మనంకూడా నేర్చుకుంటున్నాంగా !

రామి : ఏమిటి నేర్చుకునేది కబుర్లు.

సుభాన్ : గిత్తో గిత్తో అంటూ నిన్నటినుంచి ఎక్కడా అంతులేదు. ఇప్పుడొచ్చి నన్ను డబాయిస్తున్నాడు నేర్పలేదని.

దాదా : అయిపోయిన పెండ్లికి బాజా ఎందుకు ? ఇప్పుడన్నా మొదలెట్టండి తొందరగా.

[అంతా లేచి నుంచుంటారు; ఇంతలో రాముడు ప్రవేశం]

రాముడు : (వస్తూనే) సుబానయ్యా, సుబానయ్యా !

సీత : ఏమిటి రాముడూ ?

రాముడు : బాబయ్యగారిని పోలీసోళ్ళు పట్టుకొని దొరవారి కొట్టో పెట్టిన్రు.

కమల : ఎవరిని ! మన్నయ్యనా ?

(ఔనని రాముడు తల వూపుతాడు)

రామి : పదండశ ! ఇంకా జూస్తారేమిటి ?

రాముడు : ఆడకొద్దుబాబూ, ఆడ పోలీసులుండరు.

రామి : ఏం ఉంటే, తేలేదేమిటో ఇప్పుడే తేలుద్ది.

యల్లు : అంతే, ఇయ్యాల అటో ఇటో తేలాలిసిందే; లేకపోతే ఏంది ?

దాదా : ఎప్పటికిమల్లే ఏదో మాటాడ్డానికి పిల్చాడనుకున్నాగాని, ఇంతకాడికి వస్తందనుకోలేదు.



కమల : అన్నయ్యా అంతే అనుకున్నాడు. లేకపోతే అసలు వెళ్ళేవాడే కాదు.

సీత : నాకు మొదటినుంచీ బయంగానే ఉంది. తీరా వెళ్ళేటప్పుడన్నా కూడా, "రామయ్యనన్నా వెంట తీసుకెళ్ళరాదా" అని.

సుభాన్ : మేంకూడా అక్కడే ఉంటాం అనుకొని వచ్చి ఉంటాడు. ఏంరాములూ ఆయన్ని అక్కడే ఉంచారా? నాకా (స్టేషన్)కి తీసికెళ్తన్నారా ?

రాములు : ఇప్పుడే తీసికెళ్ళబోతున్రు, కొట్టోబడేసి కొడతన్రు.

రామి : పదండశ పదండి. చావో బతుకో ఇయ్యాల తేలిపోవాలి.

దాదా : సరేపదండి ఆయనబోయాక ఇంకా మనం ఉండి ఎందుకు ?

సీత : పదండి నాయినా, పదండి. ఎన్నాళ్ళు బతుకుతాం ఈ పాడుబతుకు ఎప్పుడైనా చావాలిసిందే.

సుభాన్ : మనం జేసిన ప్రమాణం మళ్ళీ ఒకసారి జ్ఞాపకం తెచ్చుకోండి. బొందిలో ఊపిరి ఉండగా ఈ దేశముఖ్ కి, ఈనవాబుకి లొంగిపోగూడదు. మన జన్మ హక్కులకోసం మనం తెగించి పోరాడుదాం. మన నాయకుణ్ణి ఎలా తీసుకెళ్తారో చూద్దాం, పదండి. దెబ్బతో కోటతలుపులు బద్దలుగావాలి. బోలో ఆంధ్రమహాసభకీజై !

[కమల పాట అందుకుంటుంది. అందరూ కలిసి పాడుతూ బయల్దేరి వెళ్ళుతూ ఉంటారు]

ఆంధ్రుడా లేవరా
ఆంధ్రుడా బిరాన లేవరా ॥ఆంధ్రుడా॥

ఆంధ్రమాత వీరమాత అనెడి పేరునిల్పరా
కూలి-రైతు విప్లవాగ్ని జ్వాల లేపి నిలిచినా
నేలమట్టమాను ధనిక పాలనంబు నేడెరా ॥ఆంధ్రుడా॥

నెత్తురొలికి పారినా నీదు శిరసు రాలినా
కత్తిదూసి శత్రువులను గదిమి గదిమి కూల్చరా
ఆంధ్రప్రజలు మూడుకోట్లు ఐక్యమై ఎదిర్చినా
బంధములను త్రెంచి విశాలాంధ్ర నిల్పగలమురా
ఆంధ్రుడా.

(అందరూ వెళ్ళిపోతారు.)

[ తెర ]



# VI

## దివాణం

(వెంకట్రావు, మస్తాన్‌లు మాట్లాడుతూ ప్రవేశిస్తారు)

వెంక : దొంగముండాకొడుకు రాముడెంత పనిజేశాడు?

మస్తాన్ : చేస్తాడు! చేస్తాడు! (మీసం దువ్వుతూ) ఈసారి నాకంట బడనివ్వండి తాటిముట్ట జీరినట్టు బద్దలుగా పగలజీరుతానో లేదో!

వెంక : ఏది అడిగినా చేతులు నలుపుతూ వెధవ నోట్లో నాలికే లేనట్లు మాట్లాడేవాడు!

మస్తాన్ : అసలీగాడిదకాదండీ! మన గుట్టంతా వాళ్ళకు జెప్పి కోటకు చిచ్చుబెట్టింది! అవ్వాళ పరుగెత్తుతా ఉంటే "ఎక్కడికిరా, యెక్కడికిరా" అంటే పలికాడా? ఎప్పుడుజూచినా ఇంటిదగ్గిర ఉండేవాడేకాదు. కాస్తి సందయితే సరే,పోయి ఆ వీరారెడ్డి కొంపలోనే చచ్చేవాడు!

వెంక : ఉహుఁ, అందుకనేనా వీరారెడ్డిని పిల్చిరారా అంటే గబగబా పరుగెత్తేవాడు! చివరకీ వెధవ నన్నుకూడా బోల్తాకొట్టించాడన్నమాట!

మస్తాన్ : అసలెప్పుడో వాణ్ణి మెడబట్టి బైటికి గెంటాలిసింది. తంతే ఏడామడదూరం పోయి పడతాడు. వీడి అవతారానికితోడు ఇప్పుడు సాదనం నేరుస్తున్నాడు! సాదనం!

వెంక : (ఆశ్చర్యంగా) సాధనం ? ఎక్కడ ?

మస్తాన్ : ఇంకెక్కడ? వీరారెడ్డి పెరట్లోనే. రాత్రింబగళ్ళు వాళ్ళకిప్పుడు నిద్దరుందా ? ఎప్పుడూ అదేపని.

వెంక : అయితే ఇక ఈ వస్తాదులంతా మన నవాబు మీదకే దండయాత్ర సాగిస్తారన్నమాట ?

మస్తాన్ : ఏడ్చారు ! ఒక్కొక్కళ్ళని నిలువునా కాల్చే సెయ్యనూ . గుండు కొళడు బిస్మిల్లా, ఏమిటను కున్నారో ? ఈ తుంటకర్రలతో వీళ్ళు చేసి చచ్చే దేమిటి పట్వారీసాబ్ ? (దగ్గరకువచ్చి మెల్లగా) మన కేమండీ ? కావలసినన్ని......

వెంక : ఏమిటి ?

మస్తాన్ : ఒకటేమిటి! పిస్తోళ్ళు, తుపాకులు, మరతుపాకులు...

వెంక : ఎక్కడివి ?

మస్తాన్ : (నవ్వుమొగంతో) మన అమీన్‌సాబ్ ఉన్నాడుగా ! ఇక్కడ మా సంఘానికి పెద్ద వారేనండీ !

వెంక : ఏమిటి మీ సంఘం ? ఇత్తిహాదుల్ ముస్లిమీనా ?

మస్తాన్ : అదేనండీ, అదే ! వాళ్ళు మాకు బోలెడన్ని తుపాకులు పంపిస్తారట ! మొన్న మన అమీన్‌సాబే చెప్పాడు. (జేబులోనుంచి పిస్తోలు తీసి చూపెడుతూ) మొన్న పోతూ పోతూ ఇచ్చెళ్ళాడు.

వెంక : అచ్ఛా ! బహుత్ అచ్ఛా ! ఇకనీ దెబ్బకెదురు లేదు. నీ ఇష్టం. కానియ్ ! (శ్రీనివాసరావు ప్రవేశిస్తూ ఉండగా జూచి కొంచెం కంగారుపడి



మళ్ళీ సంబాళించుకొని) నమస్కారమండీ శ్రీనివాస రావుగారూ,

(మస్తాన్ పిస్తోలు కనపడకుండా హడావిడిగా జేబులో పెట్టేస్తాడు)

శ్రీని : నమస్తే (మస్తాన్ వైపు తీవ్రంగా చూస్తూ అంటాడు)

వెంక : (కుర్చీ చూపెడుతూ) రాండి, దయచేయండి, మస్తాన్ ఊఁ (వెళ్ళమని సైగ జేస్తాడు)
(శ్రీనివాసరావువైపు కోరచూపులుజూస్తూ మస్తాన్ వెళ్ళిపోతాడు)

శ్రీని : (కుర్చీలో కూర్చుంటూ) ఏమండీ ! వెంకట్రావుగారూ, అంతా క్షేమమా ?

వెంక : ఆహా ! తమదయవల్ల ఇంతవరకు అంతా క్షేమంగానే ఉన్నాం.

శ్రీని : ఏమిటి ? ఇవ్వాళఏదో కొత్తధోరణిలో మాటాడుతున్నారే ?

వెంక : (విషపునవ్వు నవ్వుతూ) ఎబ్బే ! తమరెరుగందేముందండీ ? మరుక్షణం ఏంజరగనుందో మానవమాత్రులం మనకేం తెలుస్తుంది ? ఈఘటం శాశ్వతమా ?

శ్రీని : ఏమిటి అలాసెలవిస్తున్నారు ? ఇంతలో అంతవైరాగ్యం వహించారే !

వెంక : అంతేకాదండి మరి, ఇదికలియుగం. ఏముంది ఇవ్వాళ బండ్లు ఓడలవుతాయి, రేపు ఓడలు బండ్లు అవుతాయి.

శ్రీని : (నవ్వుతూ) ఈ ఉపోద్ఘాతమంతా ఇప్పుడు దేనికి ? అసలు విషయమేమిటో చెప్పుదురూ ?

వెంక : ఏముంది? మొన్న మీరు అలా వెళ్లారో లేదో గుంపుకు గుంపు కోటమీద వచ్చిపడి ఎంతగోల చేశారనుకున్నారు! సమయానికి నేనున్నానుగాబట్టి సరిపోయింది. లేకపోతే ఎన్ని పీనుగలెళ్లేవో! ఎంత గొడవయ్యేదో! చివరకు లేనిపోని అప్రతిష్ఠ అంతా వచ్చి మా పైనబడేది.

శ్రీని : ఏం?

వెంక : ఏముందండీ. వీళ్లు వట్టి పశువులు, ఎటుబడితే అటే, గొఱ్ఱెలమంద. నెత్తిన నోరుబెట్టుకొని నేనెంత మొత్తుకుంటే ఏం లాభం? అసలు నామాట వాళ్ళ చెవుల్లో దూరితేనా? (ఒక నిట్టూర్పు విడిచి) ఇంతకీ ఇది మంచికి కాలంగాదు లెండి! ఈ రోజల్లో ఎంత పెద్ద రౌడీ అయితే అంత ఘనుడు. ఏముంది! వాళ్ళకి పాపభీతా పాడా? పొట్టగోసినా అక్షరం ముక్కలేని మాలవెధవలు కూడా పెద్ద పెద్ద నీతులు చెప్తూ ఉంటే! ఇంకా ఎందుకండీ మన చదువూ సంధ్యా?

శ్రీని : ఏమిటండీ వెంకట్రావుగారూ, ఇంకా మీరుకూడా ఇక్ష్వాకులనాటి కాలంలోనే ఉన్నారు. తోటి మానవుల్ని మాలవెధవలు మంగలివెధవలు అనుకుంటూ మడిగట్టుకొని ముక్కు మూసుకుని కూర్చునే రోజులా ఇవి; కాల ప్రవాహాని కెదురీదడం ఎవరికి సాధ్యమవుతుంది?

వెంక : నేంమాత్రం మారడల్లేదండీ ఎక్కడ మడిగట్టుక కూర్చున్నాం? ఎప్పటిమాటో ఎందుకు? మొన్న



మొన్నటి దాకా ఈ వీధిన నడవడానికి ఒక్క మాల వెధవకి గుండెలున్నాయా? వీళ్ళతస్సాదియ్య! ఇవ్వాళ గంగిని గంగమ్మా అని పిల్చినా పలకదే! ఇంకా ఈ ఊళ్లో ఉండేదెట్లాగంట!

శ్రీని : ఈ ఒక్క ఊళ్ళోనే కాదు లెండి! ఇప్పుడే వూరెళ్ళినా ఇదే పరిస్థితి.

వెంక : అయితే యికమేం 'క్రిష్ణా రామా' అనుకుంటూ పోయి గంగలో దూకవలసిందే నన్నమాట!

శ్రీని : ఎందుకండీ అంతంత పెద్దమాటలు వెంకట్రావుగారూ? మీరుకూడా కొంచెం లోకంతో పాటు మారుతూ ఉంటే ...

వెంక : ఇంకా ఒక టేమారడం! ఇళ్లూవాకిళ్ళూ వాళ్ళకొప్పగించి ఒకదండం పెట్టడమే.

శ్రీని : ఎందుకండీ దీని కింతరాద్ధాంతం? కాంగ్రెసు పోరాటం ప్రారంభించాక అనేకమంది పటేళ్లు పట్వారీలు రాజీనామా లిస్తున్నారుగదా? మీరుకూడా ఆ నౌకరీకి ఒక సలాంగొట్టి దస్త్రం అవతల పారేయగూడదూ? ఇంకా నైజాం నవాబునే పట్టుకొని వేళ్లాడతాం అంటే ఎలా కుదురుతుందండీ?

జగ : (లోపలనుంచి ప్రవేశిస్తూ) ఇప్పటికే ఈ గాడిదలకి కండ్లు నెత్తిమీది కొచ్చాయి. పైన నవాబు కూడా లేకపోతే వీళ్ళకింకా పట్టపగ్గాలుంటాయా?

వెంక : } (లేచి) నమస్కారమండీ,<br>
శ్రీని : } నమస్తే!

జగ : (కూర్చొంటూ) కూర్చోండి ! కూర్చోండి,

శ్రీని : నవాబు లేకపోతే దేశమంతా అరాచకమై పోతుందనా మీ ఉద్దేశం, సూర్యుడస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యమే ఎగిరిపోతే దిక్కు లేదుగాని, ఇక ఈ నవాబా మనమీద పెత్తనం చలాయించేది ?

వెంక : అదీకొంత నిజమే అనుకోండి, అయినా అక్కడంటే గాంధీగారి లాంటి మహాత్ములు సారథ్యం వహించి నడిపారు. మరి ఇక్కడ అంతటి సమర్థులేరీ ? ఏమండీ శ్రీనివాసరావుగారూ! నేను తెలియక అడుగుతాను నైజాం నవాబు పోవాలన్నారు సరే, అదిమంచిదే అనుకుందాం. మరి ఇదెక్కడ గొడవండీ దేశముఖులు కూడా పోవాలట.

శ్రీని : ఆ గొడవంతా ఇప్పుడనవసరం. ముందీ నైజాంప్రభుత్వంపోతే తర్వాత సంగతేదో ప్రజలే నిర్ణయిస్తారు.

జగ : (కోపంగా) ఎవరు ? ప్రజలా ? ప్రజలంట ప్రజలు. మా హక్కుల్ని లాక్కోడానికి ఈ ప్రజలెవరయ్యా.

వెంక : (వికటంగా నవ్వుతూ) ఎవరు ! ఈ అల్లరిమూకే? కోతికి కొబ్బరికాయ ఇస్తే ఏంజేస్తుందండీ శ్రీనివాస రావుగారూ ?

శ్రీని : (కోపంగా) ఏంజేస్తుంది! కన్పిస్తూనే ఉందిగా? మాట్లాడాలని కోటకు రమ్మని కబురంపించి అరెస్టుచేయడం, గదిలోబడేసి కొట్టడం. . .

వెంక : ఇదిగో ఇలాగే ఉంటుంది. చెప్పుడు మాటలు విని చివరకు మీరుకూడా బొల్తాకొట్టారన్న మాట !



కోటకు రమ్మని కబురంపించింది అమీన్‌సాబ్ ఆ వెధవ ఆయనదగ్గిర ఏం తలబిరుసుగా మాట్లాడాడో అరెస్టుజేసి నాలుగుతన్ని గదిలోబడేశాడు. అసలు విషయం తెలుసుకోకుండా పెద్దలు మీరుకూడా ఈ అభాండం మా నెత్తినే వేస్తున్నారు.

శ్రీని : పట్వారీసాబ్, మీరుకొత్తగా నాకేం చెప్పనవసరం లేదు. ఎవళ్లు తిట్టారో ! ఎవళ్లు కొట్టారో ! అదంతా నాకు తెలుసు.

జగ : ఏం కొడితే ? కొడతాం,చీలుస్తాం. నా ఊళ్ళో నా ఇష్టం.

శ్రీని : (దిగ్గునలేచి) ఆరోజులు గతించిపొయ్యాయి. ఇప్పటికైనా కళ్ళు తెరవండి. ప్రజల తరఫున నిలబడండి. లేదా నైజాం నవాబుకు పట్టేగతే మీకూ పడుతుంది. సెలవు. (వెళ్ళి పోతూ ఉంటాడు)

జగ : (కోపంగాలేచి) ఈ మొరిగే కుక్కల్లో నీవొకడివి జమ. పోవయ్యా, పో. మీరంతా కలసిచేసే తల్లకిందులేమిటో అదీ చూస్తాను. (వెంకట్రావు వైపుతిరిగి) కాంగ్రెసు పెద్దంట ! పెద్ద ! ఇలాంటి మచ్చును అసలు కోటకు చేరనివ్వ వద్దయ్యా అంటే విన్నావూ ? నీ తెలివి తగలెయ్య (అంటూ చఱ్ఱున లోనికి వెళ్ళి పోతాడు. "చిత్తం చిత్తం" అంటూ వెంకట్రావు గుడ్లు తేలేసి చేతులు నలుపుకుంటూ ఉంటాడు)

( తెర )

# VII

## వీరారెడ్డి ఇల్లు

[సుభాన్ ఒక్కడే ముందు స్టేజ్ మీదికి వచ్చి "హోయ్ హోయ్" అని గెరిల్లాపాట ప్రారంభిస్తాడు. తర్వాత యల్లమంద, రామిరెడ్డి, రాముడూ, దాదా, సీతమ్మ, కమల ఒక్కొక్కళ్ళే పాట అందుకుంటూ ప్రవేశిస్తారు.]

హోయ్ హోయ్ హోయ్ - నైజాం హోయ్
హోయ్ హోయ్, హోయ్ - నాజీలోయ్,
కార్మికులారా! కర్షకులారా!
యువకులార! విద్యార్థుల్లారా! ముందుకు దూకండోయ్!

కరీం నగరమున - గాలిపల్లెలో
ఆకునూరులో - ఆత్మకూరులో
సూర్యాపేటను - జనగాంలోనూ
బాలేముల్లో - పల్లెపల్లెనూ,
శత్రుమూకలను పరిమార్చెడి మన సైన్యాలవిగోనోయ్!

లేరా, అబ్బాస్ - మోహన్, గోపీ,
కమల, సీత, - కాసిం బీబీ
మాలా మాదిగ - మంగలి చాకలి
కాపూ, కమ్మా - కమ్మరి, కుమ్మరి
తెలగా రెడ్డీ - ధీరుల్లారా!
విప్లవశంఖాన్నాది వైరులను - విదళించగ - రండోయ్!

కొండల్లో - లోయల్లో
ఉరుముల్లా - మెరుపుల్లా
సింహాల్లా - గర్జించే
గెరిల్లా - లరుగోనోయ్
అలుగూ అంబూ - పలుగూ పార
కొడవలి గొడ్డలి - కొంకీ కర్ర
వడిసెల, రాళ్ళు - బల్లెం బాకు
అందుకోర నీ - ఆయుధాలివె
ముందుకురికితివ! - మోహరించితివ!
గుండెలు పగిలీ - కూలును నైజాం లేలే రారా

లేలే లేవర రా పోరుకు రారా
దేశద్రోహులతా - దేశముఖులు యీ
జాగీర్దార్లూ - జమీందారులు
బంజరుదార్లూ - వతన్దారులూ,
నైజాం రాక్షస - నరహంతకుడు
నల్లదొరలు ఈ - తెల్లదొరలునూ,
పటేలు పట్వా - రీ భూతాలును,
ప్రజా బలాన్నెదిరించ లేవు - నిజప్రజ్ఞ జూపుమోయీ!

అంతులు గింతులు - అడ్డుకట్టలూ
ఆపలేరు ని - న్నడ్డలేరురా
కార్మిక కర్షక - గమ్యస్థానం
కన్నుచూపులో - గననగు చున్నది
స్వాతంత్ర్యము స్థాపించువరకు వి - శ్రాంతిలేదు లేవోయ్

[పాట సగం జరుగుతూ ఉండగా వీరారెడ్డి, శ్రీనివాసరావులు ప్రవేశించి పక్కన నుంచుని చూస్తూఉంటారు. పాట పూర్తిగా అయిపోయిన తర్వాత వీరారెడ్డి, శ్రీనివాసరావుగార్లు స్టేజ్ మీదికి వస్తారు.]

శ్రీని : (వీరారెడ్డి భుజంమీద చేయివేస్తూ) షాబాష్! బాగుంది. ఒక్కొక్కళ్ళని సింహపు పిల్లల్లాగా తయారు జేశావు. గ్రామానికొక ప్రజారక్షణ దళం ఇలాగే తయారయితే ఈ నిరంకుశ నిజాం ప్రభుత్వం మూడు రోజుల్లో కాళ్ళ బేరానికిరాదూ ?

(సీతమ్మ కమలలు లోపలికెళ్తారు)

వీరా : (కుర్చీ చూపెడుతూ) కూర్చోండి.

(శ్రీనివాసరావు కూర్చుంటూ ఉంటాడు)

వీరా : (రైతులకు శ్రీనివాసరావుగారిని చూపించి) వీరు మన జిల్లా కాంగ్రెసు నాయకుల్లో ప్రముఖులు శ్రీనివాసరావుగారు.

దాదా : సలాంబాబూ, సలాం.

(శ్రీనివాసరావు నమస్కారం చేస్తాడు, యల్లమంద వగైరాలు శ్యాల్యూట్ చేస్తారు)

వీరా : సుభాన్! నిన్న సూర్యాపేటకు మిలటరీ వచ్చిందని తెలిసింది. ఇవ్వాళ బహుశా ఇక్కడికి వస్తారేమో. ఊరు చుట్టూ బహుజాగ్రత్తగా కాపలాగాయాలి. పదండి.

సుభాన్ : రా, రామిరెడ్డీ, వెళదాం.

(సుభాన్, రామిరెడ్డి, యల్లమంద, రాముడూ వెళ్లుతూ ఉంటారు.)

వీరా : ఇదిగో సుభాన్, మాట. (సుభాన్ దగ్గరకువస్తాడు)



ఊరిబైట చింతచెట్టుమీద, ముందొక గట్టిమనిషిని కాపలా బెట్టు.

సుభాన్ : మనరామిరెడ్డే ఉంటున్నాడుగా.

వీరా : సరేపద. (సుభాన్ వెళ్ళిపోతాడు.)

వీరా : (మంచంవాల్చుతూ) దాదా, రా కూర్చో, (దాదా, వీరారెడ్డి ఇద్దరూ మంచంమీద కూర్చుంటారు.)

దాదా : (శ్రీనివాసరావుతో) ఏంబాబూ, ఇప్పుడు కాంగ్రెసోరినికూడా కొట్టి కైదులో బెడుతున్నారటగా ?

శ్రీని : ఔను, కాంగ్రెసుకూడా ఇప్పుడు పోరాటం ప్రారంభించింది.

దాదా : అయితే ఇక ఈ నవాబురోజులు దగ్గిర బడ్డయ్యన్నమాట.

వీరా : అదేలాగూ తప్పదులేదాదా. పోరాటం ఇప్పుడు అన్ని జిల్లాలకు, అన్ని తాలూకాలకు వ్యాపించింది. కాని ఈ జరిపే పోరాటాన్ని కాంగ్రెసూ కమ్యూనిస్టులు కలిసి ఐక్యంగా నడపడంల్లేదు. ఇదొక్కటే ఇంకా లోపంగా ఉంది.

దాదా : (శ్రీనివాసరావుతో) ఏంబాబూ, మీకిద్దరికీ పగాడు ఒక్కడేనాయె. వాడు మీ యిద్దరిమీదా కత్తిగట్టి దెబ్బతీస్తానే ఉండె. మరి మీ యిద్దరూకూడా కాస్తే మాటమాటాగలుపుకొని కలిసి అడిపనేదో పడితే బాగుంటుందిగా ?

శ్రీని : నిజమే అనుకో దాదా, కాని మా పెద్దవాళ్ళు ఏవో లేనిపోని సందేహాలు పెట్టుకొని ఇంకా వెనకాడుతున్నారు.

దాదా : కిందోళ్ళంతా కలిసి కట్టుగా పనిజేస్తంటే పెద్దోళ్లు మట్టుకు ఏం చేస్తారులే బాబూ కలసిరాక.

(కమల టీ తీసుకొచ్చి ముగ్గురికీ యిస్తుంది)

శ్రీని : (టీ త్రాగుతూ) మీ గ్రామాన్ని చూస్తుంటే నాకు మహాసంతోషంగా ఉందండీ వీరారెడ్డిగారూ, హిందువులు ముస్లిములు అన్నదమ్ముల్లాగా ఒక్కమాటమీద నడుస్తున్నారు. ఇత్తిహాదుల్ ముస్లిమీన్ వాళ్ళు అసలు ఇక్కడ ప్రవేశించనేలేదా ఏమిటి?

వీరా : ప్రవేశించకేం? చేయవలసిన ప్రయత్నమంతా చేశారు కాని వాళ్లపప్పులేమీ ఉడకల.

దాదా : ఈ ఊళ్ళో ఉన్న సాయబులమంతా సంగంలో కలిసి చెడిపోయామంట! ఎక్కడనుంచో ఇంకా కొత్తోళ్ళని దింపి ఇక మమ్ముల్ని ఉద్ధరిస్తారట!

వీరా : అవును. వాళ్ళకు భూములిస్తాం, ఉద్యోగాలిస్తాం అని మాయమాటలు జెప్పి నమ్మించి తీసుకొస్తున్నారు. తీరా ఇక్కడకువచ్చి మానభంగాలకు, అంటువ్యాధులకు, ఆత్మహత్యలకు గురిఅవుతున్నారు.

దాదా : బూములిస్తారట బూములు. ఇక్కడున్న మా సాయిబులకు తింటానికి తిండిలేదు గాని ఇక వీళ్లు కొత్తగా వచ్చేవాళ్ళకు తవ్వితలకెత్తుతారట! చెప్పే వాళ్ళు చెప్పినా ఈ మాట వినేవాళ్ళెట్లా నమ్ముతారంట!

శ్రీని : ఈ వలసవచ్చే ముస్లింలతో చాలా పెద్ద పేచీగానే ఉందండి వీరారెడ్డిగారూ, వీళ్ళద్వారా పతిగ్రామంలో



మతకలహాలు రెచ్చగొట్టి ఉద్యమాన్ని నాశనం చేయాలని చూస్తున్నారు.

వీరా : ప్రజల కష్టసుఖాల్లో పాల్గొంటూ మనం ముందుండి పనిచేసినచోట ఈ మతపిచ్చ ఏమీ పనిచేయదు. కాశ్మీరులో షేక్ అబ్దుల్లా హిందువుల్ని, ముస్లింల్ని, సిక్కుల్ని కలిపి ఒకేతాటిమీద నడిపిస్తున్నాడు. అక్కడ జాతీయవాదులు, కమ్యూనిస్టులు కలిసిపనిచేస్తున్నారు. కాబట్టే అక్కడ పోరాటం అంత జయప్రదంగా కొనసాగుతూంది.

(తెరలోనుంచి డప్పులమోత వినపడుతుంది. అంతా లేచి ఆలకిస్తూ ఉంటారు. సీతమ్మ, కమల లోపలనుంచి హడావిడిగా వస్తారు)

కమల : అన్నయ్యా, అన్నయ్యా. అదిగో డప్పులమోత వాళ్లు వస్తున్నారట్టుంది.

వీరా : ఔను, మిలటరీ వస్తూంది. దాదా పద. ముందు నీవు మన సుభాన్ వాళ్ళ ఇంటికి వెళ్ళి స్త్రీలందరినీ తగిన జాగ్రత్తలో ఉండమను.

దాదా : సరే, నీవుకూడా కొంచెంజాగ్రత్తగా ఉండునాయనా

వీరా : మరేం పర్వాలేదులే దాదా; పద నీవు పద

దాదా : (రెండడుగులేసి మళ్ళీ వెనక్కి తిరిగి) అమ్మా, సీతమ్మా, ఆరాచ్చస ముండాకొడుకులిటు వస్తారేమో మీరుమట్టుకు కొంచెం జాగ్రత్తగా ఉండండమ్మా!

సీత : మాకేం భయంలేదులే దాదా, పిన్ని అసలే భయస్తురాలు. నీవు తొందరగా వెళ్లు.

కమల : (ధైర్యంగా) మాకేం పర్వాలేదు దాదా, మమ్ముల్ని మేం రక్షించుకోగలం.

శ్రీని : (కమల వైపు చూచి) షాబాష్, తెలుగుబిడ్డ వనిపించావమ్మా, షాబాష్ పదండి, వీరారెడ్డిగారూ నేనూ మీతోపాటే వస్తున్నా.

(వీరారెడ్డి శ్రీనివాసరావులు గబగబా వెళ్ళిపోతారు)

కమల : వదినా, వాళ్ళుముందు గబగబా మనింటికి వస్తారేమో, గడపదాటి లోపల అడుగు బెట్టనివ్వగూడదు.

సీత : నాఇంట్లోనే అడుగు బెట్టనిస్తాగా. సరేగాని నీవుమాత్రం కాస్త జాగ్రత్తగా ఉండమ్మా, వాళ్ళసలే కోతిముండా కొడుకులు.

కమల : అయితేఏం? మనమే అంతచేతులుజచ్చి ఉన్నామా.

సీత : అంతేలే. మన చేతనైనంత మట్టుకు మనం పోట్లాడదాం, నీవుమాత్రం తొందరపడక నేను జెప్పినమాటినూ.

కమల : ఏమిటి వదినా, అలా అంటావ్ ?

సీత : ఏం లేదులే అమ్మా, నీవసలే చిన్నపిల్లవి. నీవిక్కడే ఉండు నేనుగడపలో నుంచుంటా.

కమల : అదేమిటి? నేనుకూడా నీతోపాటే నుంచుంటాను.

సీత : కాదులే, నీకు తెలియదులే. నేనే ఉండాలి గడపలో, వాళ్ళసలే తాగుబోతు ముండాకొడుకులు. నా ప్రాణం వుండగా నీవంటిమీద చేయి బడనిస్తానా ? (తెరలో పెద్దకలకలం, తుపాకికాల్పుల ధ్వని వినబడుతుంది.)

కమల : వదినా, వదినా, వాళ్ళు మనింటిమీదికే వస్తున్నారట్టుంది.

(సీతమ్మ గబగబా గడపదగ్గిరకు పరుగెత్తు కొస్తుంది. పోలీసులు తలుపులతోసుకొని లోనికి వస్తూవుంటారు.)



సీత : ఎవళ్లురా మీరు మా ఇంట్లోకి వస్తారు ?

పోలీసు : లే, అడ్డంలే.

(సీతమ్మను పడద్రోసి పోలీసులు లోపలికి వస్తారు. కమల ఇంట్లోకి పరుగెత్తుతుంది. పోలీసులు, రౌడీలు, అమీన్, మస్తాన్, పట్వారీలు లోపల ప్రవేశిస్తారు. గాంధీ, నెహ్రూ వగైరా నాయకుల ఫోటోల దగ్గిరనుంచి చేతికందిన ప్రతి సామానూ బైటికి గిరాటువేస్తూ ఉంటారు. కమల కారపు ముంత తీసుకొని లోపలినుంచి వస్తుంది. కమలనుచూచి మస్తాన్ వికటంగా నవ్వుతూ "చిక్కాక ఎక్కడికి బోతావులే పిల్లా" అంటూ చేతులు జాచుకొని గ్రుడ్లురుముతూ కమల మీదికెళుతూ ఉంటాడు. సీతమ్మ త్వరత్వరగా లేచి ప్రక్కనున్న రోకలిబండ అందుకొని వెనగ్గావచ్చి మస్తాన్ తలమీద బెట్టి బాదుతుంది. మస్తాన్ కెవ్వున ఒక పిచ్చికేక వేసి కింద బడతాడు. పోలీసులు, రౌడీలు సీతమ్మమీద పడబోతారు. కమల కారపుముంతలోంచి రెండుగుప్పెళ్ళకారం దీసి అందరి కళ్ళల్లో కొడుతుంది. అందరూ కళ్ళునలుపుకుంటూ ఉంటారు. ఇంతలో వెనకనుంచి ప్రజల జయజయధ్వానాలు వినపడుతూ ఉంటాయి. అందరికంటె ముందు దాదా పరుగెత్తుకుంటూ వస్తాడు.)

దాదా : ఆడోళ్ళమీద కెళ్ళడానికి మనుషులు గాదంటరా మీరు. గాడ్దెకొడుకుల్లారా. (అంటూ సింహంలాగ గర్జిస్తు వచ్చి పారిపోవడానికి తారాడుతూ ఉన్న పట్వారీని లాగి ఒక తన్ను తంతాడు. పట్వారీ ఆ దెబ్బకి గింగిరాలు తిరిగి కిందపడతాడు. ఇంతలో అమీన్ తన చేతిలో ఉన్న రివాల్వర్ ని దాదావైపు

గురిపెట్టి కాలుస్తాడు. దాదా పొత్తికడుపులోనుంచి గుండు దూసుకుపోతుంది. "అల్లా! అల్లా! అంటూ దాదా నేలమీదపడి తన్నుకుంటూ ఉంటాడు. పట్వారీ-లేచి మెల్లగా తప్పించుకొని పారిపోతాడు. సీతమ్మ "దాదా దాదా" అంటూ పరుగెత్తుకొచ్చి దాదా తలను బట్టుకుంటుంది. అమీన్ మళ్ళీ రివాల్వర్ కాలుస్తాడు. గుండుతగిలి సీతమ్మ పడిపోతుంది. సుభాన్, రామిరెడ్డి యల్లమందలతో సహా ఇంకా కొందరు ప్రజలు పరుగెత్తుకుంటూ వస్తారు. అమీన్‌తో సహా పోలీసులుకూడా పిక్కబలం జూపి పరుగు బుచ్చుకుంటారు. "వదినా, వదినా" అంటూ కమల సీతమ్మ దగ్గరకు వస్తుంది. ఇంతలో మరోవైపునుంచి చెమటగారుతూ రొప్పుతూ నెత్తురు మరకలతో, వీరారెడ్డి శ్రీనివాసరావు ప్రవేశిస్తారు. వారితోపాటు మంగలి రాముడుకూడా పరుగెత్తుకుంటూ వస్తాడు.

వీరా: (దాదాను జూచి) దాదా దాదా (అంటూ గుండె మీద చేయివేసి ముక్కుదగ్గిర వేలుబెట్టి చూస్తూ ఉంటాడు. మంగలి రాముడు లోపలికి పరుగెత్తి నీళ్లు తీసికొస్తాడు. వీరారెడ్డివైపుజూచి కమల అన్నయ్యో అంటూ కేక వేస్తుంది. వీరారెడ్డి సీతమ్మ దగ్గరకు పరుగెత్తుకుంటూ వస్తాడు. శ్రీనివాసరావుకూడా వచ్చి వీరారెడ్డి ప్రక్కన నిశ్చేష్టుడై నుంచునుంటాడు.)

సీతమ్మ: (వీరారెడ్డివైపుజూచి క్షీణస్వరంతో) దాదా, దాదా.



వీరా: ఇంకెక్కడి దాదా. (మంగలి రాముడుదగ్గిర నీళ్ళు తీసుకొని సీతమ్మ చేత రెండు గుక్కలు తాగిస్తాడు.)

సీత: దాదా పొయ్యాడా, పొయ్యాడా; పాపం మనకోసం.. చచ్చిపొయ్యాడా. (కొంచెంసేపు ఆగి, కమలవైపు చూచి) ఏడవకమ్మా ఏడవకు; అబ్బాయేడీ?

(కన్నీరు తుడుచుకుంటూ కమలలోపలికెళ్ళి అబ్బాయి నెత్తుకొని ప్రవేశిస్తుంది. సీతమ్మ చేతులు జాచుతుంది. అబ్బాయిని కమల సీతమ్మ చేతుల్లోకిఇస్తుంది.)

సీత: (బిడ్డని ముద్దాడి మళ్లీ కమల చేతికిస్తూ) బిడ్డని నీచేతుల్లో పెడతన్నా. వీడికిక...నీవే...నమ్మా...తల్లివి.

(కమల అబ్బాయిని తీసుకుంటూ ఉంటుంది)

(తెర)

# VIII

## సమాధులు

[సీతమ్మ, దాదే సాహెబుల సమాధులు. కమల, వీరారెడ్డి, శ్రీనివాసరావు, సుభాన్, రాముడు చేతులు జోడించి పాడుతూ ఉంటారు. వీరారెడ్డి చేతిలో బేబీ ఉంటుంది. సమాధులపై అగరువత్తులు వెలిగించి కమల వీరారెడ్డి చేతిలోనుంచి బేబీని తీసుకుంటుంది.]

దేశ సేవకులార తెలుగు జోదుల్లార
దేశానికై మీరు దేహ మర్పించార! ॥దేశ॥
మీకీర్తి చంద్రికలు మీధైర్య శౌర్యములు
లోకాన వ్యాపించి చీకటుల పోదోలె ॥దేశ॥
హిందువులు ముస్లిములు ఏకమై ఈనాడు
మీరక్త వాహినులు పారి తడిసిన చోట
స్వాతంత్ర్య ధ్వజమెత్తి జయగీతి పాడెదము ॥దేశ॥

రాముడు : ఇద్దరూ ఇద్దరే దేవతలు, ఇట్టాంటోళ్ళని కాల్చి చంపిన్రు రాచ్చసముండాకొడుకులు.

సుభాన్ : అవును ఇద్దరూ ఇద్దరే, నివురుగప్పిన నిప్పులాగా ఉండేవారు; ఏమాట మాట్లాడినా తూచినట్టు మాట్లాడేవాళ్లు.

కమల : "నా బొందిలో ప్రాణం ఉండగ్గా నీవంటిమీద చేయ బడనిస్తానా అమ్మాయీ" అంది. కంటిరెప్పలాగా ఎప్పుడూ నన్ను కనిపెట్టి ఉండేది.



రాముడు : కోప మెట్టాంటిదో ఎరుగదు మాతల్లి. మాబోటి పనిబాగులోళ్ళనికూడ తూలి ఎప్పుడూ ఒకమాట అని ఎరుగదు.

సుభాన్ : అదేమిటో! వాళ్ళిద్దరూ తండ్రీ బిడ్డలులాగా ఉండేవాళ్ళు. నవ్వులాటకైనా సరే, దాదాని మనం ఏమన్నా అంటే ఆమె ఊరుకోనేదిగాదు.

కమల : దాదామాత్రం వేళాకోళానికైనా వదినమీద మాట పడనిచ్చేవాడా! మమ్మల్ని మరీ తన కన్న బిడ్డల్లాగా చూసుకునేవాడు.

వీరా : మిమ్మల్నేకాదు. అందర్నీ అలాగే చూసుకునేవాడు. మనలో ఎవరికి ఏకాస్త కష్టంకలిగినా ఆయనెంతో బాధపడేవాడు.

సుభాన్ : మనలో ఈయిద్దరే ప్రతిదానికీ వెనక్కు లాగుతారని అనుకునేవాణ్ణి. తీరా సమయం వచ్చేటప్పటికి మనందరికోసం ముందు వాళ్ళే బలిఅయ్యారు.

వీరా : మనతోపాటు ముందు ఆవేశంగా మాట్లాడకపోయినా ఏపనిలో వాళ్లు మనకంటె వెనకబడ్డారు? సమయం వచ్చినపుడు ఎప్పుడూ ముందే నుంచునేవాళ్ళు.

రాముడు : ఇంట్టాటోళ్ళని పొట్టన బెట్టుకొని గాడిదకొడుకు దేశముఖు పారిపోయిండు. చిక్కినట్టయితేనా? బతికుండగా గొయ్యితీసి పాతిపెట్టేవాళ్ళం.

సుభాన్ : పాతిపెట్టక అప్పుడే ఏమయింది? మనలో ఒక్కడు బతికున్నాసరే, ఈ దేశముఖుఅంతు, ఈనవాబుఅంతు కనుక్కోకుండా వదలిపెడతామా?

శ్రీని : ఈ నైజాంనాజీ ప్రభుత్వం నాశనమయ్యేదాకా మనకు శాంతిలేదు. ఈ కిరాతకుడి చేతుల్లో ప్రతిరోజూ సీతమ్మలాంటి మహాతల్లులు, దాదాలాంటి ఆదర్శ మూర్తులు ఎందరో బలి అయిపోతున్నారు. ఈ రాక్షస ప్రభుత్వానికి గోరీకట్టినప్పుడే మనకు మన దేశానికీ క్షేమం.

[పట్వారీ వెంకట్రావును రామిరెడ్డి వగైరా రైతులు మెడబెట్టి నెట్టుకుంటూ ప్రవేశిస్తారు. వెంకట్రావు అమాంతంగా వచ్చి వీరా రెడ్డి కాళ్ళమీద పడతాడు.]

వెంక : (ఏడ్చుకుంటూ) రక్షించాలి బాబో రక్షించాలి.

రామి : ఏమిట్రా ? నిన్ను రక్షించాలా ? పగలగొయ్యాలా (అంటూ వెంకట్రావుమీదికెళతాడు)

వెంక : బాబో శరణాగతుణ్ణి. ఈ దీనుడికి ఇక మీరేదిక్కు; బుద్ధివచ్చింది.

శ్రీని : బుద్ధి ? నీకు బుద్ధివచ్చిందా ? అసలు ఈ కుట్రంతా చేసింది నీవుగాదూ ? సత్యం, అహింస అనుకుంటూ పెద్ద కాంగ్రెసు వాదిలాగా నటించి పైన నన్నుకూడా బోల్తా కొట్టించాలని చూశావు.

వెంక : (క్రిందబడి చేతులు జోడించి) అపరాధిని బాబో, బుద్ధి గడ్డితింది. పిల్లలు గలాణ్ణి.

వీరా : ఎవళ్ళకి లేరు పిల్లలు ?

సుభాన్ : (కమల చేతిలోనుంచీ బేబీని తీసుకుంటూ) ఎంత మంది ఇలాంటి పిల్లల ఉసురుగట్టుకున్నావురా నీవు. ఈ బిడ్డ తల్లిరక్తం తాగింది నీవుకాదూ ?



వెంక : ఈ పాపం నేను జేయలేదు బాబూ. దైవసాక్షిగా జెప్పుతున్నాను. ఈకాల్పులతో నాకేం సంబంధం లేదు.

రాముడు : నోట్లో పురుగులు పడ్తయ్. ఆ మాతల్లిని చంపించింది గాక ఇప్పుడుకూడా అబద్దాలెందుకు ? గదిలో కూసోని అమీన్‌తో గుసగుస లాడింది నీవుగాదూ ? (వీరారెడ్డిని జూపించి) ఈ బాబయ్యని కొట్లోబెట్టి "మేం వచ్చిందాకా జాగ్రత్తగా కాపలా గాయమని నాతో జెప్పలా."

వెంక : దుర్మార్గుణ్ణి బాబో, ఇకమీరేమన్నా జేయండి, మీకాళ్ళమీద బడుతున్నా. ఉద్యోగధర్మంగాబట్టి అలా ఏడవాలిసి వచ్చింది. గుమాస్తా ముండాకొడుకుని. నాదేముందిబాబు ఆ దేశముఖ్ చెప్పినట్లల్లా చేశాను.

రామి : మాదగ్గిరంటరా నీ దొంగఏడ్పులు? అమ్మ పుట్టిల్లు మేనమామకి తెలియదటరా ? అసలీ ఊరికి తిప్పలు తెచ్చిందీ మాకొంపలన్నీ తీసింది నీవుగాదటరా గాడిద (మళ్ళీ తన్నబోతాడు).

వెంక : చేశాను బాబో చేశాను. బుద్ధివచ్చిందని లెంపలు వేసుకుంటున్నా–క్షమించండి. ఇక ఇలాటి బుద్ధితక్కువ పను లెప్పుడూ జేయను.

కమల : ఛీ నీచుడా ! నీకాబుద్ధి ? ఇక నిన్ను తగలేసిన్నాడే నీకు బుద్ధివచ్చేది.

వెంక : (చెంపలేసుకుంటూ) చెంపలేసుకుంటున్నా తల్లీ, ఇక మీరు చెప్పినట్టే నడుచుకుంటా. మీరు దూకమన్న

గోతిలో దూకడానికి సిద్ధంగా ఉన్నా (చేతులుజోడిస్తూ) మారేందాసుణ్ణి. మీరే జరీమానా విధించినా చెల్లించుకుంటా. మీరే శిక్ష వేసినా అనుభవిస్తా.

రామి : శిచ్చ. ఇంకా శిచ్చేమిటి? ఈ గోరీలతోపాటు నీకూ ఒకగోరీ కట్టటమే.

కమల : ఈ దేవతల గోరీలపక్కనా ఈనీచుడికి గోరీ కట్టేది?

రాముడు : నిజమేనమ్మా, మంచిమాటసెప్పావు.

శ్రీని : (పట్వారీతో) నీవుజేసిన దుర్మార్గాలకి నిన్ను ఉరిదీసినా పాపంలేదు. ఛీ, నీ మొఖం చూసినాపాపం. ఫో అవతలకి.

(యల్లమంద మస్తాన్‌ను లాక్కొస్తూ ఉంటాడు).

యల్ల : నడువ్, నడువ్ (మస్తాన్‌ను తోసుకొస్తూ పట్వారీని చూచి) వోయ్, చిక్కిండులే పిలకోడు (పట్వారీమెడ బట్టుకొని ఊపుతూ) నాయాల, కొట్టి ఏలుముద్దర ఏయిత్తావ్.

(మస్తాన్ తలవంచుకొని నుంచుంటాడు)

సుభాన్ : థూ. నీజన్మ తగలెయ్య. సిగ్గులేక ఇంకా బతికుండావ్. ఎందులో అన్నాదూకి చావకపొయ్యావా? దాదాని, సీతమ్మగారిని పొట్టన బెట్టుకున్నావు చాల్లా?

యల్ల : తేరగా వచ్చిందని దేవరపోతు మాంసం తెగదిని చూడు ఎట్టబలిసిండో.

వీరా : ముందీ ఇద్దర్నీ తీసికెళ్ళి ఆ కొట్లో బడెయ్యండి. తర్వాత చూద్దాం వీళ్ళసంగతి.

(రామిరెడ్డి, యల్లమంద చెరొకరిని బైటికి ఈడ్చుకపోతారు)



[రామిరెడ్డి, యల్లమంద తిరిగి ప్రవేశిస్తారు]

కమల : ఈ గాడిదలిద్దరూ చిక్కారుగాని అసలోడు చిక్కలేదే!

యల్ల : వోడు? దేశముకా? ఆడు ముందే నల్లగొండ పారిపోయిండు. ఎంటబడితే దొరకలా నాయాలు. కుర్రాన్నెసుకొని ఉరికిండు.

రాముడు : పీడ వదిలింది.

వీరా : పదండి పోదాం. మన పొలాలు మనం ఆక్రమించుకుందాం.

కమల : ఎన్నాళ్ళనుంచో మన తల్లి భూదేవి ఈ పాపాత్ముడి చెరలో ఉంది. పదండి, మనభూమిని మనం వదిలించుకుందాం.

రామి : ఇక నాగితలకి మేత కరువులేదు. మళ్ళీ నాబీడునా కొచ్చింది.

రాముడు : (సంతోషంగా వీరారెడ్డితో) ఏం బాబూ! మళ్ళీ మా మంగలి మాన్యం మా కొచ్చినట్టేగా!

సుభాన్ : ఇంకా వచ్చినట్టేనా ఏంటి? వెళ్ళి అరకకట్టక!

వీరా : ఈనాటికి తిరిగి మళ్లీమన భూములు మన కొచ్చాయి; కాని జాగ్రత్త.

సుభాన్ : సంఘ బలంతోనే ఇప్పుడు దేశముఖ్‌ని ఎదిరించాం. రేపు నవాబు వచ్చినా, తెల్లోళ్ళువచ్చినా ఈ సంఘ బలంతోనే ఎదిరించుదాం. మనగడ్డని మనం కాపాడుకుందాం.

కమల : అంతే. మనమంతా ఇలాగే కట్టుగా ఉంటే తెల్లోళ్ళు కాదు, వాళ్ళ తాతలొచ్చినా మన్ని ఏమీ చేయలేరు

యల్ల : ఈజాతోళ్ళు, కోతోళ్లు ఏం జేత్తారేం పదండర.

వీరా : ఈ రాక్షస ప్రభుత్వం ఉన్నంతకాలం మళ్లీ మనకు ప్రమాదందప్పదు. పదండి పోదాం. ఈనిరంకుశ ప్రభుత్వాన్ని కూలదోసి ప్రజాప్రభుత్వాన్ని స్థాపించుదాం. ఈవిజయానికి చిహ్నంగా ఇప్పుడు మన శ్రీనివాసరావుగారు ముందిక్కడ జాతీయపతాకాన్ని ఎగురవేస్తారు.

(శ్రీనివాసరావుగారు జెండా నెగురవేస్తారు. అందరూ జాతీయ పతాకకు శాల్యూట్ చేస్తారు.)

శ్రీని : మన తెలంగాణా కంతటికీ ఈ గ్రామమే ముందు ఆదర్శంగా నిల్చింది. తెలుగుజాతి గౌరవాన్ని నిలబెట్టింది. ముందీగ్రామంలోనే ప్రజాప్రభుత్వాన్ని స్థాపించుదాం. ఈ వీరమూర్తుల సమాధులమీదనే ముందు మన జాతీయ పతాకాన్ని ఎగురవేశాం. ఇక్కడనుంచే మనపోరాటాన్ని గ్రామగ్రామానికి వ్యాపింపచేద్దాం. బ్రహ్మదేవు డడ్డుపడినా ఈ మన పోరాటం ఆగదు. నిరాఘాటంగా సాగవలసిందే. పదండి, పోదాం.

వీరా : అవసరమైతే ఈ పోరాటంలో మనందరం బలి అయిపోదాం. మన రక్తాన్ని ధారవోసి ఈ జెండా ప్రతిష్ఠను కాపాడుదాం. ఈ పోరాటంలో మనం ఒక్క అడుగు వెనక్కివేసినా దాదాకు, సీతకు ద్రోహం చేసినవాళ్లమవుతాం. ఎన్ని ఆయుధాలున్నా, ఎంత సైనికబలం ఉన్నా, ఈ నైజాం నవాబు మన ఐక్యశక్తిని ఎదిరించలేడు. విజయం మనదే. పదండి, మిగతా ప్రదేశం కూడా స్వాధీనం చేసుకొని ప్రజా ప్రభుత్వాన్ని స్థాపించుదాం. "బోలో స్వతంత్రభారత్ కీ జై"



అందరు : "స్వతంత్ర భారత్ కీ జై"

వీరులార రణధీరులార నిరు
పేదల్లార ఇదె కదలండోయ్ ॥
పౌరుషమేదో చూపి దేశమున
ప్రజారాజ్యమును నిలుపండోయ్ ॥
భూమిలేని రైతేమి రైతురా
భూమినిదున్నే బానిసరా ॥
బానిస బ్రతుకునకంటె హేయమీ
ప్రపంచమున లేనే లేదోయ్ ॥
బానిసలంతా ఏకమైన ఈ
ప్రభువు లెంతరా ఒకక్షణమే ॥
పగలురాత్రి కష్టించి భూములను
పగులదున్ని పండించెదమోయ్ ॥
దున్నేవారిదె హక్కు భూమిపై
ఇది మాభూమేనోయ్
ఇది మాభూమేనోయ్ ॥

సమాప్తం.



# 'మాభూమి' పై
# ప్రముఖుల అభిప్రాయాలు

"మాభూమి చదివాను. రచయితలకు నా ధన్యవాదాలు. తెలంగాణా ప్రజల వాస్తవిక స్థితిని ఎంతో చక్కగా చిత్రించారు. ఆంధ్రభాషలో ఇది ఉత్తమోత్తమ నాటకంగా ఉంటుంది. ఆంధ్రప్రజలను, ముక్కోటిఆంధ్రులను ఐక్యపరచే నాటకంగా ఉంటుంది. తెలంగాణా ప్రజల పోరాటానికి చేయూత నివ్వడానికి మద్రాసు ఆంధ్రులను ఉర్రూతలూగించే నాటకం. హిందూ-ముస్లిం ఐక్యత, ప్రజాపోరాటాల్లో స్త్రీలు ముందంజవేయడం, సామాన్యజనం - గొల్ల యల్లమంద, మంగలి రాముడు - నూతన జీవితాన్ని నిర్మించుకోడానికి ముందుకురావడం - ఇది అంతా కండ్లకు గట్టినట్లు వాస్తవికతను చిత్రించారు. ఇది చదువుతూ ఉన్నప్పుడు సోవియట్ నాటకాలను చదివినప్పుడెంత సంతోషించానో అంతకన్న ఎక్కువ సంతోషం పొందాను. కడకు మన తెలుగులోకూడా ప్రజల వాస్తవిక జీవిత చిత్రాన్ని అచ్చటిలాగానే వ్రాయగలిగినామని సంతృప్తి కలిగింది.

ఇట్టి ఉత్తమోత్తమ నాటకాన్ని రచించినందులకు రచయితలకు నా ధన్యవాదాలు."

— పుచ్చలపల్లి సుందరయ్య

"నాటకాన్ని రచయితలు చక్కగా రచించారు. భూత భవిష్యత్కాలములను దృష్టిలో ఉంచుకొని రచయితలు ఈ నాటకంద్వారా చక్కని ప్రబోధం కలిగించినవారయ్యారు. ఈ నాటకం నన్ను తన్మయుణ్ణిచేసింది."

— హరి నాగభూషణం

"నాటకంలో రచయితలు సోదర తెలుగుప్రజల బాధలను అద్భుతంగా చిత్రించారు."

— మునిమాణిక్యం నరసింహారావు

"నాటకములు ప్రజానీకమును కార్యశూరులనుగా జేయ కలవిగా నుండవలెను. 'మాభూమి' నాటకం నిజంగా ఈ పరీక్షలో నెగ్గినదని నేను మనస్సాక్షిగా చెప్పగలను."

— పండ్రంగి కేశవరావు

"మాభూమి నాటకం తెలంగాణా జీవితాన్ని ఎంతో సహజంగా, సజీవంగా చిత్రించుతోందని నా అనుభవాన్ని బట్టి చెప్పుతున్నాను."

— రావి నారాయణరెడ్డి

"మాభూమి' తెలంగాణా ప్రజల్లో అసమగ్రతను పారద్రోలి తెలంగాణాలో ఒక విప్లవజ్యోతిని వెలిగించుతోంది. ఆంధ్ర నాటకరంగంలో ఒక కొత్తశకం ప్రారంభమయింది."

— కొప్పరపు సుబ్బారావు

"ఈ నాటక రచన కొద్దిలో మిక్కిలి అందంగా ఉంది. ఇందులో అచ్చమైన తెలుగు జాతీయము కుప్పలుకుప్పలుగా ఉంది... ఈ మాభూమిలో ఉన్న భాష తెలుంగుగడ్డతోం బుట్టిన భాష. 'చూడబోతే కుచ్చీకాయ లేరు' 'పట్టుమని పదేండ్లన్నా' 'ఎనిమిదెకరాలగడ్డ' 'ఎందుకువచ్చిన నోటి రంకురా బాబూ' 'బొక్కెడుకండ' ఇల్లాంటి లోకంలో ఉన్న మాటలు సర్వథా ఉన్నవి. ఏరివెయ్యాలని వేసినవికావు. 'ఆ పిల్లనెత్తిన ముండా చిట్టెడుగింజలు పడేదాక నాకేం తోచదు' ఇల్లాంటి మాటలు ఎన్ని వున్నవో చెప్పలేను."

"మఱి లోకోక్తులు సందర్భోచితంగా బహురమణీయంగా ఎన్నో ఉన్నవి. 'మనకున్న దాంట్లోనే కాసిని వాళ్ళకిచ్చి కాసుకతాగమందాం; 'గానుగలోదే గంపెడు' మేము కవులమని ఆోమ్ములు విఱుచుకొని పద్యాలు వ్రాసి ఏనుగు లెక్కి గండపెండేరాలు వేయించుకొనే కవులల్లో ఎంతమందికి ఈ అచ్చమైన, జాతీయమైన తెలుగు భాష తెలుసు?"

"ఈ నాటకము బందగీ సమాధితో మొదలు పెట్టుతుంది. చివర సమాధులతోం బూర్తిఅవుతుంది. ఒక కావ్యానికి ఆద్యంతాలు ఇంత చక్కగా బిగించడం ఒక శిల్పపు నేర్పు."



"ఈ నాటకంలో బహుగుణాలు ఉన్నవి. పాత్రపోషణ కమ్మచ్చున లాగినట్లున్నది. మఱి దాదాయొక్క పాత్ర పోషణ సునిశితంగా ఉంది..."

"నాటకమంతా మిక్కిలి రసవంతంగా ఉందని ఇదివరకే వ్రాశాను. నాటకంలో వీరరసం, చివర అంకంలో మొదటి భాగమంతా శోకరసం, చివరకు వీరరసస్థాపన. ఈ శోకరసం సమాధుల దగ్గర నిల్చొని వీరారెడ్డి సుభాన్, రాముడు మాట్లాడే మాటలు వింటే శోకరసం పొంగివస్తుంది. అంత చక్కగా ఉంది యీ రచన"

"ఈ కవులు చిరాయుష్కులై యిల్లాంటి నాటకాలింకా వ్రాయాలని, జాను తెలుగుతల్లికి హారతు లెత్తాలని ఆశిస్తున్నాను."

— విశ్వనాథ సత్యనారాయణ

రచనలో విమర్శకు తావులేదు. నగారాబాదే సమాసాలే కవిత్వం అనుకునేవారికి ఎంతమందికి ఈ జాతీయమైన తెలుగు తెలుసు! ఈ కవులు Idiom చాలా బాగా పట్టుకున్నారు. వీరి రచనలు చూశాక మేం కవులమని చెప్పుకోడం సిగ్గుగా ఉంది. తిక్కన్న తర్వాత మళ్ళీ ఈనాడు జాతీయమైన భాష విన్నాం. ఆనాటి తెలుగు ఔన్నత్యం పునరుద్ధరించబడుతూందని ఈకవులు రుజువుచేశారు. రైలుబండి నడకలాగా ఈకవులు సంవాదం బహు చక్కగా నడిపారు. బీదరైతుల బాధలు చిత్రించారు. నైజాంలో దేశముఖులకు యింకా గోరీకట్టలేదు. కాని యిందులో కట్టారు. రామాయణం వాల్మీకి ముందుగానే గానం చేశాడు. నిజమయింది. అలాగే ఈ సత్యకవుల వాక్కు త్వరలో ఫలిస్తుందని నమ్ముతున్నాను.

— పింగళి లక్ష్మీకాంతం

"ఓరుగల్లును 'మాభూమి'గా చేసి ముక్కోటి తెలుగు బిడ్డలు ఏకమై విశాలాంధ్ర స్థాపించేందుకు ఇటువంటి నాటకాలు కృషి చేయాలని కోరుతున్నాను."

— కళా వెంకట్రావు.

"ఈ నాటకం చూడకమునుపు యింత అద్భుతంగా ఉంటుందని అనుకోలేక పోయాను. "దున్నేవాడిదే భూమి" అనే సత్యాన్ని యింత చక్కగా చూపించారు. ఈ నాటకం మన గ్రామాల్లో ప్రదర్శిస్తే బీదరైతులు, వ్యవసాయ కూలీలు 'దున్నేవాడిదే భూమి' అనే సూత్రాన్ని ఆచరణలో పెట్టి తీరుతారు. త్వరలోనే అటువంటి శాసనం వస్తుందనీ, మధ్యదళారీలు తొలగింప బడుతారనీ నేను ఆశిస్తున్నాను."

— వేముల కూర్మయ్య

"ఈ కథలో ప్రజలనేక కష్టాలు పడ్డారు. నష్టాలనుభవించారు. ఈ విషాదాన్నంతా సంఘంగా మార్చుకున్నారు. ఐక్యమయ్యారు. పోరాడారు. విజయం పొందారు. మన గ్రామాల్లో కూడా యివి నిత్యం జరుగుతున్నవే. జగన్నాథరెడ్డివంటి దేశముఖులు ఒక్క నైజాంలోనేకాదు. మన ప్రాంతాల్లో కూడా ఊరూరా వున్నారు. ఇందులో దినదినం నిరుపేదలు పడే కష్టాలు చూశాం. హృదయాలు ద్రవించాయి. కన్నీళ్ళు కార్చాం."

— బెజవాడ గోపాలరెడ్డి

"...ఈ నాటకం చదివిన-చూచిన ప్రతివ్యక్తి సోదర తెలంగాణా ప్రజల దురవస్థలకు ఉద్రిక్తుడవుతాడు. వారి ప్రతిఘటనాశక్తిని జూచి ఉత్సాహ ఉద్వేగాలతో ముందుకురుకుతాడు. ఈ తెలంగాణా "మాభూమి" ఇక ఈ దౌర్జన్యాలను, దోపిడీలను అచట సాగనీయం. వారి స్వతంత్ర పోరాటానికి సాయపడతాం" అని దీక్ష బూనేటట్లు చేస్తుందీ నాటకం.

"ప్రజల నిత్యజీవితాన్ని ఇంత వాస్తవంగా, ఇంత రసవత్తరంగా, చిత్రించగలగడానికి వారిని ప్రోత్సహించినది ఒక్క అభ్యుదయ దృక్పథమే కాదు. జీవన్మరణ సంగ్రామం సాగిస్తున్న తెలంగాణా ప్రజ వారిని ఉత్సాహపరచి ఉంటుంది.

"ముందడుగుతో ఆంధ్ర నాటకరంగంలో ముందడుగువేసిన ఈ రచయితలు ఈ రచనలో మరింత ప్రతిభావ్యుత్పత్తులను చూపారు. రచనలోనేమి, శిల్పంలోనేమి ఎంతో అభివృద్ధిని కనపర్చారు."



హృదయ ముర్రూతలూగించే పాటలు కొన్నివున్నాయి. పాత్రోచిత సంభాషణలూ, ఒడలు గగుర్పొడచి రక్తముప్పొంగించే సన్నివేశాలతో నాటకం నిండివుంది. ఆంధ్రనాటకరంగానికి, అభ్యుదయసాహిత్యానికి రచయితలు మరొక కానుక అర్పించారీరచనతో."

"ప్రతిభావంతంగా యీనాటకం రచించిన రచయితలు అభివందనీయులు."

"...ఈనాటకరచనా, ప్రదర్శనా, యువరచయితలనూ, నటకులనూ అభ్యుదయకరపద్ధతుల్లో పెట్టడానికి ప్రోత్సహించుతుందని విశ్వసిస్తున్నాను."

— తుమ్మల వెంకట్రామయ్య

(ప్రజాశక్తి 13-7-47)

"ఆంధ్రప్రజా నాట్యమండలివారు ప్రదర్శించిన 'పరివర్తనం' 'మాభూమి' నాటకాలను చూశాను. ఈ నాటకాలు రెండూ రెండే...... ఈ ప్రదర్శనాలు నేను మరువలేనివి." (ఆంధ్రప్రభ 7—12—47).

— మల్లంపల్లి సోమశేఖరశర్మ.

"ఇంతవరకు అనేకమందిమి అనేక నాటకాలు చూశాం. కాని నా ఉద్దేశంలో అవేవీ నాటకాలు మాత్రం కావనీ, ఇదొక్కటే కళాన్వితమైన నాటకమనీ నా అభిప్రాయం"

— లింగమూర్తి

"ఈ నాటకం చూచాక ప్రతి నాటకకర్తా, ప్రజలనింతగా ఆకర్షించేలాగునా, మంత్రముగ్ధుల్ని చేసే విధంగానూ వ్రాయగలగాలని కోరుకోవాలి. నేను ఈ నాటకాన్ని మూడు తడవలు చూచాను. మొదటిసారి చూచినప్పుడెంత బాగుందో, మూడోసారి చూచినప్పుడుకూడా అంతే బాగుంది."

— నార్ల వెంకటేశ్వరరావు

"సోదర తెలంగాణా ప్రజలు అష్టకష్టాలూ పడుతున్నారు. దుర్భర పరిస్థితులకు లోనౌతున్నారు. వీటినుంచి బయటపడాలంటే మనలో ధైర్య స్థయిర్యాలు రేకెత్తాలి. దానికి ఈ నాటకం మహత్తరంగా పనిచేసింది. అంతా విషాదం, అంతా సంతోషం ఉంటే నాటకం రక్తికట్టదు. ఇందులో అన్ని రసాలూ ఉన్నాయి. ఇంత అద్భుత రచనను తీసికొని ప్రజానాట్య మండలివారు ప్రదర్శించడం మన అదృష్టం."

— గాడిచర్ల హరిసర్వోత్తమరావు

—oo:o:oo—

"ఎటువంటి సాంఘిక నాటకం ఆదర్శప్రాయమో, దేనికొరకు నేను ఇంతకాలంనుంచీ కలలు గంటున్నానో, అటువంటి నాటకాన్ని ఈనాడు చూడగలిగినందుకు నాకు చాలా ఆనందంగా ఉంది. శ్రీ గురజాడ అప్పారావుగారే ఈ నాటకాన్ని చూచి ఉన్నట్టయితే 'తాముపడ్డ కష్టాలన్నీ ఫలించినాయి' అనిఉండేవారని నా భావం. నాటకాన్ని చూస్తూ ఉంటే ఉత్సాహం, ఉద్రేకం కలిగించాలి. అటువంటి నాటకాన్ని ఈనాడు మనం చూచాం"

"ఇక్కడ కూర్చున్నంతసేపూ నాటకం చూస్తున్నట్లులేదు. ఈ దృశ్యాలన్నీ మన కళ్ళయెదుట జరుగుతున్నట్లే ఉంది. చాలా సంతోషం కలిగింది. ఈ నాటకం రచించిన వారిని, ప్రదర్శించిన వారిని, నేను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను."

— గిడుగు సీతాపతి

